# మహాగణపతిని
# అభిమాన ధనులు



సంకలన కర్త

జి. సిహెచ్. రంగారెడ్డి

1998 బహుధాన్య
ఉగాది

ముఖపత్ర చిత్రాలంకరణ :
**అంజన్ బాబు**

వెల : రూ. 35/-

ప్రతులకు :
ప్రచురణకర్తల నుండి గాని
లేక
**నవోదయ బుక్‌హౌస్**
కాచిగూడ, హైదరాబాద్ -500 027

టైప్‌సెట్టింగ్ & ముద్రణా నిర్వహణ :
**శ్రావణి గ్రాఫిక్స్**
నారాయణగూడ
హైదరాబాదు - 500 029.
ఫోన్ : 7563301



ఎందరో అభిమానధనులు

అందరిలో మహోన్నతుడు

ఆయనే **శ్రీ సాధు సుబ్రహ్మణ్యం**

ఆయన కంఠసీమకే ఈ త్యాగధనుల

జీవిత చరిత్ర చిత్రణలకు విరిదండ

– బి.సిహెచ్. రంగారెడ్డి

# ప్రకాశకుల వినతి

బండారు సర్ోజినీ దేవి మెమోరియల్ ఫౌండేషన్ ఆశయాదర్శాలలో సమాజ పరివర్తనానికి ప్రేరణ కలిగించే పుస్తకాల ప్రచురణ కూడా ఒకభాగం. 'మరుగున పడిన అభిమానధనులు' పుస్తక ప్రచురణతో ఈ భాగం కూడా ప్రారంభించటం మాకెంతో ఆనందదాయకంగా వుంది. స్వయంగా సరోజినీ దేవిగారు కూడా హైదరాబాదు సంస్థాన విముక్తి పోరాటంలో భాగస్వాములు గనుక ఆమెతో పాటు దాదాపు యాభైమంది స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న వారి జీవితచరిత్రలను వారి ఛాయాచిత్రాలతోపాటు రచయిత శ్రీ బి.సి.హెచ్. రంగారెడ్డిగారు యెన్నో వ్యయ ప్రయాసలకు వోర్చి సేకరించి మాకందించటం మహద్భాగ్యంగా మేము భావిస్తున్నాము.

ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల సంస్థ అధ్యక్షులు, మాజీమంత్రి అయిన గౌరవనీయులు శ్రీ యం.ఎస్. రాజలింగంగారు యీ గ్రంథానికి తిలకందిద్దిటం పుస్తకాంశానికి మహత్తర గౌరవం చేకూర్చినట్లయింది.

ఆధునిక ముద్రణావిధి విధానాలను బాగుగా గుర్తెరిగిన ప్రసిద్ధ రచయిత శ్రీ వెంపోగారు మాకుటుంబానికి అతి సన్నిహితులు కూడా కావటం మూలాన అడిగినదే తడవుగా యీ పుస్తకానికి ఆకర్షణీయమైన ఆకృతిని కలిగించటంలో చూపిన శ్రద్ధకు మేమెంతగానో కృతజ్ఞులమై వుంటాము.

ఆ విధంగానే శ్రావణిగ్రాఫిక్స్ అధినేత శ్రీ యం. జనార్ధన్ గారు అత్యంత వ్యయంతో కూడుకున్న ఈ గ్రంథ ముద్రణకు తమ మొత్తం సిబ్బందితో మాకిచ్చిన వెలలేని తోడ్పాటుకు మా హృదయ పూర్వకమైన ధన్యవాదాలు తెలుపుకుంటున్నాము.

బేజారెత్తించే గజి బిజి వ్రాతలను ఎంతో ఓపికగా డి.టి.పి.తో కళకళలాడుతూ మాకన్నుల ముందు ప్రత్యక్ష పరచిన శ్రీమతి కె. సరోజినిగారి అంగుళీవిన్యాసాలకు మా హార్దిక శుభాకాంక్షలు.



**అన్నపురెడ్డి కిరణ్మయి** B.E.

సెక్రటరీ

**బండారు సరోజినీ దేవి**
**మెమోరియల్ ఫౌండేషన్**

124, నల్లకుంట నగర్, హైదరాబాదు - 36





ఈ గ్రంథానికి తిలకం దిద్దిన
**శ్రీ యం.ఎస్. రాజలింగం గారు**
మాజీమంత్రి, ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య
సమరయోధుల సంస్థ అధ్యక్షులు




మానవుడు స్వేచ్ఛాజీవి. అతని స్వేచ్ఛను నియంత్రించాలనుకొనే వారు కొంత కాలంపాటు అతికష్టం మీద నియంత్రించ గలిగితే నియంత్రించ వచ్చునేమోగాని శాశ్వతంగా మాత్రం మానవుణ్ణి బానిస బంధనాల్లో కట్టిపడేసి వుంచలేరు. అందుకే మానవుడు వ్యక్తిపరంగా జాతిపరంగా నిరంతరం స్వాతంత్ర్యం కొరకు పోరాడుతూనే వుంటాడు.

జాతిపరంగా మనం స్వాతంత్రేచ్ఛను మహాత్మాగాంధీ నాయకత్వాన నాటి సామ్రాజ్యవాద ప్రభుత్వానికి గట్టిగా చాటి చెప్పగలిగాం. భారత స్వాతంత్ర్య సమరయోధులు అనేకమందికి గాంధీ మహాత్ముడే ప్రేరణ అనటంలో యేమాత్రం అతిశయోక్తిలేదు. ఈ గ్రంథ సంకలనకర్త శ్రీ బి.సి.హెచ్. రంగారెడ్డి గారుకూడా స్వాతంత్రేచ్ఛతో ప్రేరితుడై భారతస్వాతంత్ర్య సమరాంగణాన దూకిన వారే!

స్వాతంత్ర్యానంతరం అనేక సంవత్సరాల పాటు స్వాతంత్ర్య సమరవీరులనందరిని ఒక్కచోట చేర్చే కృషిలో మే మిద్దరం కలసి పనిచేసిన వారము కావటం వల్ల శ్రీరంగారెడ్డిగారిని బాగా దగ్గరగా వుండి పరిశీలించే అవకాశం నాకు కలిగింది. ఈ పరిశీలనలో నాకు బాగా విశదమయ్యింది యేమిటంటే శ్రీరెడ్డిగారు స్వభావరీత్యా అమిత ఆవేశపరులని, ఈ ఆవేశం కలిగి వున్న కారణంగానే రెడ్డిగారు నిరంతరం అమితోత్సాహంగా యేదైనా కార్యాన్ని చేబడితే దానిని నిర్విఘ్నంగా ముందుకు తీసుకొనిపోయే వరకు నిద్రాహారాలను కూడా పెద్దగా లెక్క చెయ్యకుండా ముందుకు ముమ్ముందుకు చొచ్చుకొనిపోతూ వుంటారని. కార్యదీక్షాదక్షతతోపాటు శ్రీ రంగారెడ్డిగారు చక్కని రచనా శక్తి, విశ్లేషణాపటిమ కూడా కలిగి వుండటం ఈ గ్రంథంలో 'అభిమానధనుల' జీవిత చరిత్ర చిత్రణలే రుజువు పరుస్తాయి.

స్వయంగా తాను దేశ స్వాతంత్ర్య సమరంలో దూకి తనలాగే అకుంఠిత త్యాగనిరతిని ప్రదర్శించిన తోటి త్యాగధనుల జీవిత చరిత్రలను కొద్దిమందివే

అయినా చరిత్రకెక్కించటానికి శ్రీ రెడ్డిగారు పూనుకోవటం ఎంతో అభినందించ దగ్గ విషయం.

'మరుగున పడిన అభిమానధనులు' అని ఈ పుస్తకానికి నామకరణం చేయటం కొందరు స్వాతంత్ర్య సమరయోధులు దేశంకోసం తాము చేసిన త్యాగాలు బహిరంగపరచటానికి వెనుకాడేవారు అనే అర్థాన్ని స్ఫురింపజేస్తోంది. అటువంటి అజ్ఞాతంగా వున్న కొంతమంది స్వాతంత్ర్య సమరయోధుల దీక్షా దక్షతలను శ్రీ రంగారెడ్డిగారు లోకానికి బహిరంగ పరచపూనుకోవటం బహుథా ప్రశంసనీయం.

ఎలక్ట్రానిక్ మీడియా అత్యధికంగా ప్రాచుర్యం వహించిన ఈరోజుల్లో పుస్తక పఠనాసక్తి చాలావరకు కొరవడిందనేది నిష్ఠురసత్యం. ఇటువంటి పరిస్థితులలో శ్రీ రంగారెడ్డిగారు పుస్తక ప్రచురణకు పూనుకోవటం సాహసకార్యమే! ఇటువంటి తలంపు తనకు గలదని శ్రీ రెడ్డిగారు ఆమధ్య నాకెప్పుడో చెవినివేసినప్పుడు నాకున్న అనుభవం రీత్యా నేనాయన్ని నిరుత్సాహపరిచాను. అయినా ఒకరి నిరుత్సాహ ప్రోత్సాహాలకు లొంగే మనిషి శ్రీ రెడ్డిగారు కాదు గనుక ఆయన అనుకున్నంత పనిచేసి సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దిన ఈ పుస్తకాన్ని నా ముందు పెట్టి తిలకం దిద్దవలసిందిగా అభ్యర్థించారు.

శ్రీ రెడ్డిగారి అభ్యర్థనను కాదనటం కానిపని. అందునా పుస్తకంలో అభిమానధనుల సరసన వారి అర్ధాంగుల ఛాయాచిత్రాలను కూడా యెంతో ఓపికగా సేకరించి ముద్రించటం నాకెంతో ముచ్చటగొలిపింది. దేశస్వాతంత్ర్యం కోసం అనితర సాధ్యమైన త్యాగాలకు సిద్ధమైన వారిని శ్రీ రెడ్డిగారు కుటుంబ సమేతంగా గౌరవించబూనటం ఎంతో మెచ్చదగిన విషయం.

అభిమానధనుల జీవితాంశాలను పరిశీలించిన పాఠకులు అదే అభిమానంతో దేశస్వాతంత్ర్యానికి ముప్పువాటిల్లే ధోరణులను నిలవరించటంలో తమ ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శించటానికి సదా ముందడుగు వేయగలరని ఆశిస్తూ మరోమారు శ్రీ రంగారెడ్డిగారి కృషిని అభినందిస్తూ శెలవు తీసుకుంటున్నాను.

లలితా భవన్
1-1-336/118, చిక్కడపల్లి
హైదరాబాదు - 500 020

(సం)
యం. ఎస్. రాజలింగం

# ఏ పేజీలో యెవరు




శ్రీమతి సర్దార్ అమరావతమ్మగారు కర్నూల్ పట్టణ వాస్తవ్యులు. వీరి తండ్రి ఎనుముల అంకన్నగారు.

ఈమె తన భర్త సర్దార్ నాగప్పగారితో కలసి వ్యష్టి సత్యాగ్రహంలో లో పాల్గొన్నందుకు కర్నూల్ సబ్‌జైలులో రెండు మాసాల పాటు అండం టయల్ ప్రిజనర్‌గా జైలు జీవితం గడిపారు. తదుపరి కోర్టు ఆదేశం మేరకు 25-1-1941 నుండి 10 మాసాల పాటు వెల్లూరు జైలులో కఠిన కారాగారవాస శిక్షను అనుభవించారు.

ఆ తదుపరి జరిగిన క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా పాల్గొని 26-10-1942న అరెస్టయ్యారు. కోర్టు ఆదేశం మేరకు 5-11-1942 నుండి వెల్లూరు జైలులో కఠిన కారాగార శిక్షను అనుభవించారు.

వీరి భర్త సర్దార్ నాగప్పగారు కూడా వష్టి సత్యాగ్రహంలో పాల్గొని డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్సు క్రింద 28-11-1940 నుండి వెల్లూరు జైలులో కఠిన కారాగార శిక్షను అనుభవించారు. 250 రూపాయల జరిమానాను కూడా విధించబడింది. జరిమానా చెల్లించని పక్షంలో మరొక ఆరుమాసాల కారాగార శిక్షను అనుభవించాలని కోర్టు ఆదేశించింది. బళ్లారి తిరుచునాపల్లి, వెల్లూరు జైళ్లలో శిక్షను అనుభవించారు. కర్నూల్ జిల్లా జిల్లాబోర్డు సభ్యునిగా జిల్లా బోర్డు సమావేశంలో క్విట్ ఇండియా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. అందు వలన 21-10-1942 నుండి 9-12-1944 వరకు శ్రీ నాగప్పగారు రాజ్యాంగ పరిషత్తు సభ్యునిగాను పార్లమెంటు సభ్యునిగా కూడా పనిచేశారు. వెల్లూరు, కన్ననూరు, తంజావూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. ●

**హైదరాబాదులో కమ్యూనిష్టు పార్టీ అవతరణ**

**హైదరాబాదు సంస్థానంలో 1939లో కమ్యూనిష్టు పార్టీ అవతరించింది.**



# శ్రీ బొల్లవరం అంకిరెడ్డి

కర్నూలు జిల్లాలో రేనాడుగా ప్రసిద్ధి చెందిన కోయిలకుంట్లలో 1923లో జన్మించిన శ్రీ అంకిరెడ్డిగారి తల్లిదండ్రులు శ్రీ బొల్లవరం నాగిరెడ్డి శరభమ్మగారలు. వీరిది సాధారణమైన రైతుకుటుంబం. అంకిరెడ్డిగారు సెకండరీ గ్రేడ్ టీచర్‌గా శిక్షణ పొందారు గాని ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించలేదు. దేశవ్యాప్తంగా జరుగుతున్న స్వాతంత్ర్యోద్య మంలో యువకులైన శ్రీ అంకిరెడ్డిగారు పాల్గొని వ్యష్టి సత్యాగ్రహపు రోజుల్లో అరెస్టయి బళ్లారి ఆలీపూర్ జైలులో బంధించబడ్డారు.

ఆ తరువాత 1942 క్విట్ ఇండియా వుద్యమంలో కూడా శ్రీ అంకిరెడ్డిగారు పాల్గొని జైలుశిక్షను అనుభవించారు. ఈవిధంగా విడవకుండా భారతదేశం స్వతంత్రం అయ్యేవరకు ఈ రేనాడులో పుట్టిన అంకిరెడ్డిగారు పోరాడటం 1847లో ఈ రేనాడులోనే బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని పురిటిలోనే త్రుంచివెయ్యాలని సంకల్పించిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డిగారిని తలపింపజేస్తుంది. 1847లో రేనాడులో ప్రారంభమైన బ్రిటిష్ వారిపై తిరుగుబాటు నూరుసంవత్సరాల తర్వాత సఫలీకృతం చెయ్యటంలో రేనాటిలో పుట్టిన అనేకమంది స్వాతంత్ర వీరుల సరసన శ్రీ అంకిరెడ్డిగారిని ప్రముఖంగా చెప్పకోవచ్చు. వృద్ధాప్యంలో శ్రీ అంకిరెడ్డిగారు సతీమణి శ్రీమతి రామ లక్ష్మమ్మ సహితంగా కోయిలకుంట్లలో ప్రశాంత జీవనం గడుపుతున్నారు. ●

<u>హైదరాబాదులో దివ్యజ్ఞాన సమాజం స్థాపన</u>

*1911లో శ్రీమతి అనీబిసెంటుగారు హైదరాబాదులో ద్యివజ్ఞాన సమాజమును స్థాపించిరి.*

ప్రజల్లో ప్రబోధం చేయడంతోపాటు ప్రభుత్వానికి అబ్కారీ ఆదాయము రాకుండా వుండడానికి తాటి, ఈత చెట్లను నరికే కార్యక్రమాలను కూడా చేబట్టారు శ్రీ కిషన్‌రావుగారు.

దాని పర్యవసానంగా గ్రామాల్లోని ప్యూడలిస్టులు శ్రీ కిషన్‌రావు అయన సహ చర మిత్రులపై పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదులు చేశారు. 1948 ఫిబ్రవరి మాసంలో నిజాం పోలీసులు శ్రీ కిషన్‌రావు గారి గ్రామంపై దాడిచేసి శ్రీ కిషన్‌రావుగారిని ఆయన సహచరులను 12మందిని అరెస్టు చేసి దేవరకొండ కోర్టుకు హాజరుపరిచారు. అట్టి వారిలో కిషన్‌రావు గారి సోదరుడు ప్రభాకర రావుగారు కూడా వున్నారు. కేసు విచారణ జరిగింది. ఒక్క కిషన్‌రావుగారికి తప్ప మిగతా అందరికి శిక్షపడింది.

అప్పటికి కిషన్‌రావు గారి తండ్రి ఆరోగ్యం పూర్తిగా క్షీణించి చావు బ్రతుకులో వున్నందున కిషన్‌రావును అరెస్టు చేయలేదు. కాని పట్వారి పదవి నుంచి బర్తరఫ్ చేయుటకు ప్రభుత్వం ఆదేశించింది.

ఇంతలో అటు స్టేటు కాంగ్రేసు వైపు నుండి ఇటు కమ్యూనిస్టు పార్టీ వైపు నుండి నిజాం నిరంకుశ పాలనకువ్యతిరేకంగా హైదరాబాదు విమోచ నోద్యమం తీవ్రతరం అయింది. ఉభయ పార్టీలు కార్యకర్తలను ఆయత్తం చేశాయి. ఆ స్థితిలో శ్రీ కిషన్‌రావు గారు కృష్ణానదికి అవలగల గుంటూరు జిల్లా గురజాల తాలూకాలో శ్రీ యం. వి. రంగారెడ్డి గారి నాయకత్వ ములో నిర్వహించ బడిన సాయుధ పోరాట కేంద్రంలో సరిహద్దు పోరాటయోధునిగా ప్రవేశించి 1948 సెప్టెంబర్ 17న భారత సైన్యం సైనిక చర్య ద్వారా హైదరాబాదు సంస్థానంనువిముక్తి చేసేవరకు నిజాం పాలనకు వ్యతిరేకంగా అవిశ్రాంతంగా పోరాటం సాగించారు శ్రీ కిషన్ రావు గారు.

ఆ పిమ్మట దేవరకొండ తాలూకా కాంగ్రేసు కార్యవర్గ సభ్యులుగాను అటుపిమ్మట 1952 నుండి 1987 వరకు పంచాయితీరాజ్ వ్యవస్థలో వివిధ హోదాల్లో పదవీబాధ్యతలను నిర్వహించారు. 1952లో దేవరకొండ యన్.ఇ.యన్. బ్లాక్ సభ్యునిగాను, చింతపల్లి పంచాయితీ సమితి కో-ఆప్టెడ్ సభ్యునిగాను, 1964 నుండి 1987 వరకు గ్రామ సర్పంచ్‌గాను పనిచేసి ఆ ప్రాంత ప్రజల సర్వతోముఖాభివృద్ధికి కృషి చేశారు. ప్రస్తుతం స్వస్థలం యడగండ్లపల్లిలో విశ్రాంతి జీవితాన్ని గడుపుతున్నారు. ●

## ఉస్మానియా విశ్వవిద్యాలయం

*1915 ఆగష్టు 28న హైదరాబాదులో ఉస్మానియా విశ్వ విద్యాలయం స్థాపించబడింది. హైదరాబాదు సంస్థానంలో ఇదే మొట్టమొదటి విశ్వవిద్యాలయం.*



## శ్రీ లక్క కిష్టయ్య



## శ్రీమతి లక్క శాంతాబాయి

శ్రీ లక్క కిష్టయ్యగారు నిజామాబాదు జిల్లా భాన్సువాడ తాలూకా దేశాయిపేట గ్రామంలో శ్రీ లక్క నరసింహులు కేశమ్మ దంపతులకు ఏకైక సంతానంగా జన్మించారు. కావటానికి పద్మశాలి వంశీయులైనా శ్రీ కిష్టయ్యగారి పూర్వీకులు అనువంశిక ఆయుర్వేద వైద్యులుగా వుండి గ్రామీణ ప్రజలకు వైద్యసేవలనందించేవారు. శ్రీ కిష్టయ్యగారికి అతి పిన్నవయస్సు నుండే ఆర్యసమాజ కార్యక్రమాలపట్ల ఆసక్తి వుండేది. అందువలన హైదరాబాదు సంస్థానంలో పండితనరేంద్రజీ నిజాం నిరంకుశపాలనకు, ముస్లీం మతోన్మాదులు రజాకార్లకు వ్యతిరేకంగా చేస్తున్న ఉపన్యాసాలకు శ్రీ కిష్టయ్యగారు ప్రభావితుల య్యారు, అదే సమయంలో ఇం పీరియలిస్టు బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జాతిపిత మహాత్మాగాంధిజీ భారతదేశంలో నిర్వహిస్తున్న స్వాతంత్ర్యోదమ పాత్రను కూడా తెలుసు కున్న శ్రీ కిష్టయ్యగారు ఇటు నిజాం పాలనకు అటు ఇంపీరియలిస్టు బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న కార్యక్రమాలలో క్రమంగా పాలు పంచుకోసాగారు. అందులో భాగంగానే మద్యపానానికి, అస్పృశ్యతకు వ్యతిరేకంగా ఒకవైపు నుండే, మూఢాచారాలైన జంతు బలులను జోగినీ వ్యవస్థను నిర్మూలించుటకు మరొక వైపున ప్రచార కార్యక్రమాన్ని ప్రారంభించి ఉధృతం చేశారు. 1945 నాటికి శ్రీకిష్టయ్యగారు హైదరాబాదు సివిల్ సప్లయిస్ శాఖలో ముప్పయి రూపాయల జీతంపై అకౌంటెంటుగా ఉద్యోగంలో ప్రవేశించారు.

శ్రీ కిష్టయ్యగారి స్వగ్రామం దేశాయి పేటలో వడ్డీ వ్యాపారస్థులైన అరబ్బుల ప్రభావం ఎక్కువగా వుండేది. వారికి వత్తాసుగా దుర్కిలోని ఖాజీలు, ఇబ్రహీం పేటలోని ఖాన్‌లు గ్రామీణ ప్రజలను ఇటు వడ్డీ వ్యాపారరూపంలోను, అటు మతపరంగాను ఎన్నో హింసలకు గురిచేస్తుండేవారు. ఆ స్థితిలో శ్రీ కిష్టయ్యగారికి కాంగ్రేసు నాయకులు చౌటపల్లి హనుమంతరెడ్డిగారితోను, ఆర్యసమాజ నాయకులు శ్రీ బీర్కూరు గంగాధరరావగారితోను భాన్సువాడ శ్రీ గురు రాములు గార్ల మార్గదర్శకత్వంలో వారి ప్రేరణతో హైదరాబాదు సంస్థాన విముక్తి పోరాటంలో ఉద్యోగిగా వుంటూనే అజ్ఞాతంగా

పనిచేయసాగారు. ఇందులో భాగంగానే యువకులకు సాయుధ శిక్షణ ఇప్పించే కార్యక్రమంచేబట్టి ఆకురాతిని తెప్పించి దాని నుండి 100(వంద) బరిసెలను తయారు చేయించారు. ఆ విషయం నిజాంపోలీసులకు తెలిసి శ్రీ కిష్టయ్యగారి ఇంటిపై దాడి చేశారు. ఆ బరిసెలనన్నింటిని స్వాధీనం చేసుకున్నారు. ఉద్యోగం నుండి శ్రీ కిష్టయ్యగారిని మొదట్లో సస్పెండ్ చేసి ఆ పిదప పూర్తిగా ఉద్యోగం నుండి తొలగించారు. మరొక సారి పండుగ సందర్భంగా 1948 సంవత్సరం ప్రారంభంలో నూరుమంది యువకులతో ఆయుధాలు చేపట్టి నిజాంకు, రజాకార్లకు వ్యతిరేకంగా సాయుధప్రదర్శనను విజయవంతంగా నిర్వహించారు. ఆయుధ ప్రదర్శన మొత్తం భాన్సువాడ తాలుకాలో సంచలనాన్ని రేపింది. భాన్సువాడ పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టర్‌కు పై సంఘటన గూర్చి తెలిసింది. అతడు ముస్లీం. హుటాహుటిని పోలీసు సిబ్బందితో కిష్టయ్యగారి స్వగ్రామమైన దేశాయిపేట చేరుకున్నారు. మొత్తం యాభైమంది పై చార్జిషీటు (FIR) తయారు చేసి పై అధికారులకు పంపాడు. భవిష్యత్కార్య క్రమము ముందుకు ఇంకా సాగవలసింది గనుక పోరాట లక్ష్యాన్ని (గమ్యాన్ని) చేరుకోడానికి ఇంకా ఎంతో అవిశ్రాంత పోరాటం నలుపవలసి వుంది గనుక పోలీసుల చేతుల్లోకి దొరక కుండా అజ్ఞాతంలోకి వెళ్ళి ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలు కొనసాగించవలసిందిగా పెద్దలు కిష్టయ్యగారికి సలహా ఇచ్చారు. ఆ మేరకు శ్రీ కిష్టయ్యగారు 1945 నుండి 1943 సెప్టెంబరు 17 వరకు అజ్ఞాత యోధుడుగా పనిచేసి చివరకు భారతీయ సైన్యాలు హైదరాబాదు సంస్థానంపై పోలీసు చర్య జరిపి సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేసిన తరువాత గాని బయటి ప్రపంచంలోకి శ్రీ కిష్టయ్యగారు రాలేదు. తదుపరి బోధన్‌లో సహకార మార్కెటింగ్ సొసైటీలో అకౌంటెంటుగా, మేనేజరుగా పనిచేసి 30 ఏండ్లపాటు పనిచేసి తదుపరి పదవీ విరమణ చేశారు. అనంతరం అదే సహకార సంఘంలో డైరక్టర్‌గా, కార్యదర్శిగా, అధ్యక్షులుగా కూడా పదవీ బాధ్యతలు నిర్వహించారు.

శ్రీ కిష్టయ్యగారి మొదటి భార్య శ్రీమతి హనుమాయమ్మగారు 1958లో మరణించగా 1959లో శ్రీమతి శాంతాబాయిని రెండో వివాహం చేసుకున్నారు.

శ్రీ కిష్టయ్యగారు జాతీయోద్యమంలో ప్రవేశించిన నాటి నుండి ఈనాటి వరకు వృద్ధాప్యదశలో నున్నా మద్యపాన నిరోధానికి, మూఢ విశ్వాసాలకు, జంతుబలుల నిషేధానికి, జోగినుల (దేవదాసి) వ్యవస్థరద్దు కావడానికి మహిళల అభ్యున్నతికి ఎంతో కృషిచేస్తున్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల సంస్థ వర్కింగ్ కమిటీ సభ్యులుగా వ్యవహరిస్తూ బోధన్‌లో స్థిరపడి సతీమణి శ్రీమతి శాంతాబాయితో ప్రశాంతజీవనంగడుపుతున్నారు. వీరికి మొదటి భార్య శ్రీమతి హనుమాయమ్మగారి ద్వారా సుమతి, భారతి అను ఇద్దరు కుమార్తెలు, రెండో భార్య శ్రీమతి శాంతాభాయి ద్వారా రవీంద్రకుమార్, నరేంద్రకుమార్ అను ఇద్దరు కుమారులు కలరు.

●





## శ్రీ పి.యన్. కొండయ్య

శ్రీ పి.యన్. కొండయ్యగారు 1924వ సంవత్సరం జనవరి నెల 24వ తారీఖున అనంతపురం జిల్లాలోని ధర్మవరం పట్టణం లో శ్రీ పాపయ్య గారి నారాయణప్ప - లక్ష్మ మ్మ దంపతులకు జన్మించారు. ధర్మవరం లోనే ప్రాథమిక విద్యను అభ్యసించారు. జాతీయోద్యమంలో భాగమైన జాతీయ భాష హిందీని చదువుకోవడం ప్రారంభించడం ద్వారా శ్రీ కొండయ్యగారు జాతీయోద్యమం లో ప్రవేశించారు.

జాతీ యోద్యమ నాయకులైన జాతిపిత మహాత్మా గాంధీ, నేతాజీ సుభాష్ చంద్రబోస్ గారలు దేశంలోని ఆయా ప్రాంతాల్లో ఉపన్యసించిన ఉపన్యాసాలు పతాక శీర్షికలతో వార్తా పత్రికలలో ప్రచురించ బడటం. వాటిని చదివి జాతీయోద్యమము పట్ల ప్రేరితుడైన శ్రీ కొండయ్య గారు భారత జాతీయ కాంగ్రెసు ధర్మవరం శాఖలో కాంగ్రెసు కార్యకర్తగా పనిచేయడం ప్రారంభించారు.

## శ్రీమతి క్రిష్ణమ్మ

1940లో జరిగిన వ్యష్టి సత్యాగ్రహం ఉద్యమంలో ధర్మవరం పట్టణము నందు పాల్గొని అరెస్టుచేయబడ్డారు. అప్పటికి శ్రీ కొండయ్య గారి వయస్సు 15 సంవత్సరాలు.

ఆ పిదప ఢిల్లీ చలో నినాదంతో మరొక కార్యకర్తను వెంట తీసుకొని స్వదేశీ, స్వావ లంబనము, మద్యపాన నిషేధము, అస్పృ శ్యతా నివారణ మొదలుగాగల గాంధీజి సూచించిన నిర్మాణ కార్యక్రమాలతో పాదయాత్ర చేసుకుంటూ ఢిల్లీకి బయలు దేరారు.

రోజుకు పదిమైళ్లు వీలైతే ఇంకా ఎక్కువ దూరం చిత్తూరు, కడప, కర్నూల్ జిల్లా మీదుగా మార్కాపురం ద్వారా గుంటూరు జిల్లాలో ప్రవేశించి గుంటూరు దగ్గరకు చేరుకొనే సరికి ఉద్యమం తాత్కాలికంగా ఆపుచేయబడింది. పాదయాత్రలు నిర్వహి స్తున్న కార్యకర్తలు తిరిగి వెనక్కు వెళ్లండి అని నాయకులు ఆదేశించడంతో తిరిగి పాదయాత్ర ద్వారానే శ్రీ కొండయ్యగారు తమ స్వగ్రామం ధర్మవరం చేరుకున్నారు.

శ్రీ కొండయ్య గారితో సత్యాగ్రహంచేసిన 11 మందిలో ఆయన వెంట పాదయాత్రలో పాల్గొన్నది ఒకరు మాత్రమే. ఈ విధంగా ఈ పాదయాత్ర ముందుకు వెళ్లడానికి తిరిగి వెనక్కు రావడానికి 4 1/2 మాసాలు పట్టింది.

ధర్మవరానికి తిరిగి వచ్చిన శ్రీ కొండయ్య గారు ధర్మవరం పట్టణంలో పట్టమ్మ గుడి వద్ద బహిరంగసభను నిర్వహిస్తుండగా పోలీసులు అక్కడకు చేరిన ప్రజలనందరినీ దారుణంగా హింసించారు. ప్రజలు భయ భ్రాంతులై తలోదిక్కుకు పారిపోయారు. ఆ తరువాత ముందుగా నోటీసు ఇచ్చి ప్రభుత్వ కార్యాలయంపై కాంగ్రెసు జండాను ప్రతిష్టి స్తామని తెలిపి కొందరు మిత్రులతో వెళ్లి ధర్మవరంలోని తాలూకా కచ్చేరిపై కాంగ్రెసు జండాను శ్రీ కొండయ్యగారు ప్రతిష్టించారు.

శ్రీ కొండయ్య గారు ఈ విధంగా ఎదగ డానికి ముఖ్యంగా రాయలసీమ పితామహు డైన శ్రీ కల్లూరి సుబ్బారావుగారు ప్రధాన కారకులు. వారి ప్రేరణ వల్లనే శ్రీ కొండయ్య గారు జాతీయోద్యమంలో ప్రవేశించారు. దానికి తోడు తండ్రి ప్రోత్సాహం కూడా ఎంతో వుండింది.

శ్రీ కల్లూరి సుబ్బారావుగారిచే హిందూ పురంలో స్థాపించబడిన సేవామందిరంలో కొంత కాలముండి నిర్మాణ కార్యక్రమాల్లో (నేతపని) పాల్గొన్నారు శ్రీ కొండయ్య గారు. 11 సంవత్సరాలపాటు మునిసిపల్ వర్కర్ల యూనియన్ ప్రెసిడెంటుగా వుండి మునిసిపల్ కార్మికుల హక్కులపై పోరాటం సలిపారు శ్రీ కొండయ్యగారు.

శ్రీ కొండయ్య గారికి డాక్టరు నీలం సంజీవరెడ్డి, శ్రీ పప్పూరి రామాచార్య, శ్రీ తరిమెల నాగిరెడ్డి, శ్రీ వి.కె. ఆదినారాయణ రెడ్డి, శ్రీ వల్లూరు రామారావు, శ్రీ పి.వి. చౌదరి గార్లతో మంచి పరిచయాలు వుండేవి.

వీరు ప్రస్థుతం ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల సంస్థ ఉపాధ్యక్షులుగా యుంటున్నారు. అంతకుముందు కార్య దర్శి పదవీ బాధ్యతలు నిర్వహించారు. వీరు తమ సతీమణి, కూతురు, కుమారునితో ధర్మవరంలో ప్రస్తుతం ప్రశాంత జీవనం గడుపుతున్నారు. ●

<u>భారతజాతీయ కాంగ్రెసు స్థాపకుడు</u>

*మొట్టమొదటి జాతీయ కాంగ్రెసు మహాసభ డబ్ల్యు.సి. బెనర్జీ అధ్యక్షతన 1885లో బొంబాయిలో జరిగింది. దీని వ్యవస్థాపకుడు "అలెన్ ఆక్టేనియస్ హ్యూమ్"*



## శ్రీ కోట కృష్ణారెడ్డి

శ్రీ కోట కృష్ణ రెడ్డిగారు 1926లో నల్లగొండ జిల్లాలోని సుర్యాపేట తాలూకాలో బురకచర్ల గ్రామంలో కోట పిచ్చిరెడ్డి పాపమ్మగార్లకు మధ్య తరగతి రైతు కుటుంబంలో జన్మించారు. వీరికి ఒక అన్న ఇద్దరు తమ్ముళ్లు, ఇద్దరు చెల్లెళ్లు కలరు. ప్రాథమిక, మాధ్యమిక, హైస్కూల్ విద్యను సూర్యాపేట లో అభ్యసించారు. ఇంటర్ మీడియేట్‌ను హైదరాబాదులో చదువు కున్నారు.

సూర్యాపేటలోను, హైదరాబాదులోను చదువుతున్న రోజులలో విద్యార్థి సమస్యల పరిష్కారానికి విద్యార్థి యూనియన్‌ను శ్రీ ధర్మభిక్షంగారి ప్రేరణతో స్థాపించి తీవ్రమైన కృషి చేశారు. 1947లో నిజాం నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ తన సంస్థానాన్ని ఇండియాలో విలీనం చేయ బోనని ప్రకటించి నప్పుడు ఆంధ్ర మహాసభ ద్వారా శ్రీ కృష్ణారెడ్డి గారు వామపక్ష రాజ కీయాలపై ఆకర్షితులై నప్పటికి ఆదిలో స్వామి రామానంద తీర్థగారి పిలుపు మేరకు కళాశాల విద్యను బహిష్క రించి చదువుకు స్వస్తి చెప్పి సాయుధ శిక్షణ పొంది, తదుపరి [illegible]



## శ్రీమతి కోటలక్ష్మమ్మ

వరంగల్ జిల్లా ములుగు తాలుకా నార్లపురం గ్రామంలో ఆయుధంతో పట్టుపడి అరెస్టయి నిజాంస్టేట్ జైళ్లలో రెండేళ్లు గడిపారు.

అంతకుముందు కూడా బ్రిటిష్‌వ్యతిరేక జాతీయ ఉద్యమంలో పాల్గొన్నందున విజయవాడ బందరు జైళ్లలో 7 నెలలు నిర్బంధించబడి బయటకు వచ్చారు.

అటుపిమ్మట సూర్యాపేట తాలూకా వెళ్లి అక్కడ వెట్టి చాకిరీకి వ్యతిరేకంగాను, ప్రభుత్వానికి ఆదాయాలు రాకుండా నిరోధించడానికి మద్యపాన నిరోధక కార్య క్రమాన్ని చేబట్టి కల్లు, సారా దుకాణాల ముందు పికెటింగ్‌లు చేయడం, తాటి, ఈత చెట్లను నరకడం, ప్రభుత్వమునకు రైతులు చెల్లించే లెవీ ధాన్యాన్ని రైతులు చెల్లించ కుండా నిరోధించడం మొదలగు కార్య క్రమాలను చేబట్టి అక్కడ నిజాం వ్యతిరేక ఆందోళనను ఉధృతం చేశారు. ఫలితంగా సిరికొండ, సుబ్రవేడులలో గల నిజాం పోలీ సులు, రజాకార్లు శ్రీ కృష్ణ రెడ్డిగారి ఆస్తిపాస్తులను దోచి వారి ఇంటిని

అప్పటికి నిజాంను, నిజాం ప్రభుత్వాన్ని మత దురహంకారులైన రజాకార్లను ఎదుర్కో డానికి సాయుధ పోరాటమే సరైన మార్గమని ఎంచుకొని కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యంలో సాయుధ శిక్షణను పొంది, తదుపరి కార్యకర్తలకు శిక్షణనిచ్చి సాయుధ పోరాట కార్యకర్తలుగా నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడి పనిచేయుటకు తయారు చేశారు. ఈ విధంగా 1948 సెప్టెంబరు 17న నిజాం సంస్థానంపై సైనిక చర్య ద్వారా ఇండియన్ యూనియన్ లో విలీనం చేసి హైదరాబాదు సంస్థానానికి విమోచనం కలిగించే వరకు అనేక త్యాగాలు చేసి పోరాటాలు చేసిన యోధుడు శ్రీ కృష్ణారెడ్డి గారు.

నిజాం సంస్థానము నవాబు కబంధ హస్తాల నుండి విముక్తమై బయటపడి ఇండియన్‌యూనియన్‌లో విలీనం అయిన తరువాత తిరిగి స్వగ్రామం బురకచర్లకు వచ్చి స్థిరపడి ఆ గ్రామ పంచాయితీ అధ్యక్షులుగా ఎన్నికయి 5 సంవత్సరాల పాటు గ్రామాభివృద్ధికి ఎంతో కృషిచేసి, ఎన్నో గ్రామాభ్యుదయ కార్యక్రమాలను చేపట్టారు.

శ్రీ కృష్ణారెడ్డి గారు రైతాంగ భూ సమస్య లగు బంచరాయి కారీజ్‌కాతా మొదలుగా గల వేలాది ఎకరాల ప్రభుత్వ భూమిని పంచుటకు నాయకత్వం వహించి పంచారు. ఈ పోరాటాలలో ప్రభుత్వ నిర్బంధాలకు గురి కావడం వలన బురకచర్ల గ్రామము నుండి వరంగల్ జిల్లా, ములుగు తాలూకా పసర గ్రామానికి వలస వెళ్లి అక్కడ స్థిర పడ్డారు.

అక్కడ ములుగు తాలూకాలోని లక్నా వరము చెరువు నీటికాలువల మరమ్మత్తు లపై కృషిచేయడంతో పాటు రైతాంగంపై విధించిన అధిక శిస్తులను తగ్గించాలని హైకోర్టు నుంచి మూడువేల ఎకరాలకు శిస్తు తగ్గింపు ఆదేశాలను తెచ్చారు .

ములుగు తాలూకాలోని రాంపురం, కన్నాయిగూడెం గ్రామాలను ప్రభుత్వం ట్రైబల్ గ్రామాలుగా చిత్రించి రైతాంగాన్ని భూముల నుండి తొలగించుటకు బేదకల్ నోటీసులు ఇచ్చినపుడు పైరెండు గ్రామాలు ట్రైబల్ గ్రామాలుకావని, తిరిగి ప్రభుత్వం నాన్ ట్రైబల్‌గా ధృవీకరించునంతవరకు పోరాటం చేయడంతో పాటు భూములు ఎలాంటి స్వభావం కలిగినవైనా వాటిని సాగుచేస్తున్న రైతులు బేదకల్ కాకుండా వుండునట్లు అండగా నిలిచారు. ములుగు తాలూకాలోని ఏజెన్సీ ప్రాంతంలో స్థిరపడిన రైతులందరికి తాముసాగుచేస్తున్న భూముల పై యాజమాన్యపు హక్కును కల్పించాలని రైతాంగ ఉద్యమాలలో పాలు పంచుకోవ డంతో పాటు వృద్ధాప్య పెన్షనులు, నివేశన స్థలాలు లేని నిరుపేదలకు నివేశన స్థలాలు మంజూరు తోపాటు వాటి నిర్మాణంకోసం అవిశ్రాంత మైన కృషిని కొనసాగించారు

1987 మార్చిలో జరిగిన గోవిందరావు పేట మండల ప్రజా పరిషత్ అధ్యక్ష పదవికి సిపిఐ పక్షాన పోటీ చేశారు. ఇప్పటికీ 72 సంవత్సరాల వయస్సులో కూడా వివిధ ప్రజాసమస్యలపై కృషి చేస్తున్న శ్రీ కృష్ణారెడ్డి గారు వరంగల్ జిల్లా, గోవిందరావు పేట మండలంలోని "పసర" గ్రామంలో వ్యవసాయపు పనులు చూసుకుంటూ సంఘసేవకునిగా పనిచేయుచున్నారు. ●



# శ్రీ రంగాపురం కృష్ణారెడ్డి

శ్రీ రంగాపురం కృష్ణారెడ్డిగారు 1925లో మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన అమర్‌చింత ఆత్మకూరు సంస్థానంలో మద్దూరు గ్రామములో రంగాపురం యెర్రా రెడ్డి -చిన్న లక్ష్మమ్మ దంపతులకు జన్మించారు. స్వగ్రామంలోనే ప్రాథమిక విద్యను ఒక ప్రయివేటు టీచర్ వద్ద అభ్యసించారు. 1947 ఆగష్టు 15 తరువాత అమర్‌చింత ఆత్మకూరు సంస్థానంకు చెందిన మద్దూరుకు సమీప గ్రామమైన అప్పంపల్లిలో నిజాంకు, రజాకార్లకు వ్యతిరేకంగా హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలి అని నినదిస్తూ సత్యాగ్రహం చేశారు. సత్యాగ్రహులపై నిజాం పోలీసులు కాల్పులు జరిపారు. ఆ కాల్పుల్లో పండ్రెండు మంది యోధులు మృతిచెందారు. మిగతా వారందరూ తప్పించుకొని పారిపోయారు. ఆవిధంగా పోలీసులు, రజాకార్ల బారినుండి తప్పించుకు వెళ్లిన శ్రీ కృష్ణారెడ్డిగారు వేషం మార్చుకొని తిన్నగా హైదరాబాదు మీదుగా నల్లగొండ భువనగిరి తాలూకా గుండ్రాంపల్లిలో శ్రీ కోదండ రామిరెడ్డి గారి నాయకత్వంలో నిర్వహింపబడిన గెరిల్లా దళంలో చేరి రజాకార్ల దౌర్జన్యాలకు, దోపిడీలకు, గృహదహనాలకు వ్యతిరేకంగా జరిగిన గెరిల్లా పోరాటంలో పాల్గొని పనిచేశారు. ఈ విధంగా నిజాం వ్యతిరేకోద్యమంలో 1948 సెప్టెంబర్ 17వరకు పనిచేసి ఆ పిమ్మట హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో కలిసిపోవడంతో 1948 సెప్టెంబర్ తరువాత కూడా సాగిన రైతాంగ సాయుధ పోరాటానికి స్వస్తి చెప్పి వెనక్కు తిరిగి వచ్చి ఆ పిమ్మట హైదరాబాదులో స్థిరపడి ప్రశాంత జీవనం కొనసాగిస్తున్నారు.



# శ్రీ గంగారామ్ ఆర్య

వీరు రంగారెడ్డి జిల్లా షాద్‌నగర్ తాలూకా పాలుమాకల గ్రామంలో 1924లో సాధారణ కుటుంబంలో జన్మించారు. ప్రత్యేకంగా పాఠశాలలో విద్యను అభ్యసించకపోయినను ఆర్యసమాజ కార్యకర్తగా తెలుగు హిందీ భాషలను కైవసం చేసుకోగలిగారు. శ్రీ నారాయణరావ్ పవార్, శ్రీ జగదీష్ ఆర్య సాహచర్యంలో నిజాంపై బాంబు వేసే కార్యక్రమంలో పాల్గొని రాజద్రోహ నేరం క్రింద పట్టుబడి 5-12-1947 నుంచి 26-3-1948 వరకు కారాగార క్లేశాన్ని అనుభవించారు. 18-12-1947 నుండి 19-12-1947 వరకు పోలీసు కస్టడీలోను 19-12-1947 నుంచి 26-3-1948 వరకు జుడిషియల్ కస్టడికిపంపబడ్డారు. తదుపరి సెషన్స్‌కోర్టు యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించింది. హైకోర్టు, నిజాం జుడిషియల్ కమిటి ఆ శిక్షను ధృవీకరించింది. పోలీసు చర్య అనంతరం హైదరాబాద్ సంస్థానం విముక్తి పొందాక 1949 ఆగష్టు 10న వీరిపై కేసు ఎత్తివేయబడి విడుదల చేయబడ్డారు. అనంతరం స్వగ్రామంలో వ్యవసాయ కార్యక్రమంలో పాల్గొంటు ప్రస్తుతం వృద్ధాప్యం కారణంగా గండిపేటలో పండిత గంగారాంగారిచే స్థాపించబడిన వయో వృద్ధుల సేవాశ్రమంలో విశ్రాంతి తీసు కొంటున్నారు.

శ్రీ నారాయణ రావు పవార్, శ్రీ జగదీశ్ ఆర్య, శ్రీ గంగారామ్ ఆర్యలను భారత పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో లాలా దేశబంధు గుప్తా, ప్రకాశ్ శాస్త్రిగారలు భారత ఉపప్రధాని శ్రీ వల్లభభాయ్ పటేల్ గారికి పరిచయం చేసినప్పుడు వారిని శ్రీ పటేల్ గాఢంగా ఆలింగనం చేసుకొని అభినందించారు.

1996 డిశెంబర్ నాలుగు నాటికి ఈ ఉదంతం జరిగి యాభై సంవత్సరాలు గడచిన సందర్భంలో ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరవీరుల సంఘం గాంధీ భవన్‌లో ఈ ముగ్గురు వీరులను ఘనంగా సన్మా నించింది. ఆయురారోగ్య ఐశ్వర్యాలతో ఈ త్యాగధనులు నూరు సంవత్సరాలపాటు జీవితాన్ని కొనసాగిస్తు జాతి జనులకు ప్రేరణ కలిగిస్తారని ఆశిద్దాం. ●





## శ్రీ ముండ్లమూడి గోపాల రావు

## శ్రీమతి సువర్ణ

శ్రీ ముండ్లమూడి గోపాలరావు గారు 1922 జనవరి 5 సికిందరాబాదు నగరంలో శ్రీ రామదాసు-మంగమ్మ దంపతులకు జన్మించారు. హెచ్ఎస్‌సి వరకు విద్యన భ్యసించారు.

1942 జూన్‌లో హెచ్‌యస్‌సి పూర్తవ గానే 1942 ఆగష్టున దేశవ్యాపితంగా గాంధీ మహాత్ముని పిలుపుతో క్విట్ ఇండియా ఉద్య మం ఆరంభమైంది.

ఆ ఉద్యమములో శ్రీ గోపాలరావుగారు ప్రవేశించి అటు బ్రిటిష్ ఇండియాకు, ఇటు నిరంకుశ నిజాంకు వ్యతిరేకంగా పోరాటం సాగించి సత్యాగ్రహం చేశారు. ఆ ఉద్యమం ఉధృత మైనపుడు డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సు 38వ సెక్షన్ 5వ ఉపనిబంధన క్రింద అరెస్టు చేయ బడి సికిందరాబాద్ స్పెషల్ మేజిస్ట్రేటు చేత ఆరు మాసాలకు పై బడిన కఠిన కారాగారవాస శిక్ష తోపాటు 50 రూపాయల జుర్మానా కూడా విధించ బడింది. జుర్మానా చెల్లించని పక్షంలో మరొక నెల రోజుల పాటు కఠిన కారాగార శిక్షను అనుభవించాలని కోర్టు ఆదేశించింది. 13-11-1942 నుండి సికిందరాబాదు జైలు లో 2-3-1943 వరకు కఠిన కారాగారవాస శిక్షను అనుభవించారు. అటుపిమ్మట శ్రీ గోపాలరావుగారిని ప్రభుత్వము తనకై తానే స్వచ్ఛందంగా విడుదల చేసింది.

అనంతరం శ్రీ గోపాలరావు గారు నిరంకుశ నిజాంకు వ్యతిరేకంగా అతని పాలన అంతం కావడానికి హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావడానికి అజ్ఞాత యోధునిగా, సాయుధపోరాట యోధునిగా 6-8-1947 నుండి 20-9-1948 వరకు పోరాటాన్ని కొనసాగించారు. భారతసైనిక చర్యతో హైదరాబాదు సంస్థానం విముక్తం పొంది ఇండియన్ యూనియన్ లో విలీనం అయ్యాక 21-9-1948 స్వేచ్ఛగా అజ్ఞాతం నుండి బయటికి వచ్చారు.

శ్రీ గోపాలరావుగారు శ్రీ వట్టికోట ఆళ్వారు స్వామి, డి. సత్యనారాయణ, బాలరాజు నేషనల్ లాడ్జి శ్యాం సహచర్యంలో నిజాం ప్రభుత్వానికి వ్యతి రేకంగా పనిచేశారు. 1950లో సాంకేతిక విద్యాశాఖ లో టైపురైటింగ్ పరీక్షలో ప్యాసయి ఇండియన్ రైల్వేసులో టైపిస్టు ఉద్యోగంలో ప్రవేశించి, చీఫ్ పార్సల్ క్లర్కు వరకు పదోన్నతిని పొంది పదవీ విరమణ చేశారు. ప్రస్తుతం వీరి వయస్సు 76 సంవత్సరాలు. వీరి సతీమణి శ్రీమతి సువర్ణ గారితోను కొడుకులు-కోడండ్రూ కూతుండ్రు- అల్లుండ్రతో మారేడపల్లిలోని ఇంద్రపురి కాలనీ లో ప్రశాంతంగా జీవితాన్ని గడుపుతున్నారు. ●




చక్రాయపేట మండలం, మహదేవపల్లె గ్రామమందు జన్మించిరి. ప్రాథమిక విద్య మహదేవపల్లెనందు చదివిరి. 1940 సంవత్సరము వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొనుటకు దరఖాస్తు పంపగా మైనరు అయినందున మహాత్మాగాంధిగారు నిరాకరించిరి. తర్వాత 1942 క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొనిరి. కడపజిల్లా నందున మద్రాసునందు వుద్యమమునకు సంబంధించిన కార్యకలాపములు చేయు చుండిరి. 1943 ఫిబ్రవరి నెలలో మద్రాసునందు అరెస్టు చేసిరి. తర్వాత మద్రానునందు ఎలిఫెంట్‌గేటు పోలీస్‌స్టేషన్, తేనాంపేట పోలీస్ స్టేషనులయందు 15 రోజులు కస్టడీలో వుంచబడిరి. తర్వాత మద్రాసు సిటిజైలులో వుంచిరి. ఛీప్ ప్రెశిడెన్సీ మేజిస్ట్రేట్ కోర్టులో ఎగ్మోరు మద్రాసు నందు విచారణ జరిపిరి. తర్వాత రెండు సెక్షన్‌ల క్రింద 3 సంవత్సరముల కఠిన కారాగార శిక్షను విధిస్తూ రెండు శిక్షలు ఒకేతూరి అమలు జరుపవలయునని తీర్పునిచ్చిరి. తర్వాత పెనిటెన్షరీ జైల్లో నుండి ఆలీపురం జైలుకు మార్చబడిరి. అక్కడ తన జైలు శిక్షను పూర్తిగా అనుభవించి విడుదల కాబడిరి.

ఆంధ్ర కర్ణాటక హిందీ మహావిద్యాలయము అనంతపురం, రాయలసీమ హిందూస్థానీ విద్యాలయము కసనూరు నందునహిందీ విద్యను అభ్యసించిరి.

తర్వాత రాయచోటి తాలూకా కాంగ్రెస్ కమిటి కార్యదర్శిగాను కడప జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా చాలా సంవత్సరాలు పనిచేసిరి. సహకార రంగంలో జిల్లా కేంద్రసహకార బ్యాంకు డైరెక్టరుగా ఉన్నారు. 1975 వ సం॥రములో మలేషియా థాయ్‌లండ్, జావా, రిపబ్లిక్ ఆఫ్ చైనా, హాంగ్‌కాంగ్, శింగపూర్ దేశాలందు భారత ప్రతినిధి వర్గ సభ్యులుగా, సహకార రంగం గురించి అధ్యయనం చేసి వచ్చిరి.

1982 వ సంవత్సరములో 'ఇస్కస్' ప్రతినిధి వర్గ సభ్యులుగా సోవియట్ యూనియన్ నందు పర్యటించిరి. ఇప్పటికీ సహకార ఉద్యమం పట్ల అమిత అభిమానంతో పనిచేయుచున్నారు, వీరు బ్రహ్మచారి.





## శ్రీ పరెడ్డి చెన్నారెడ్డి

భూస్వామ్య వ్యతిరేకపోరాటానికి అగ్రగామిగా నిలచిన నల్లగొండ జిల్లాలో యాదగిరి గుట్ట మండలం ధర్మారెడ్డి గూడెంలో 1925 అక్టోబరు పదిన శ్రీ పరెడ్డి చెన్నారెడ్డి గారు జన్మించారు. శ్రీ నరసింహారెడ్డి- రాధమ్మ దంపతుల మగ సంతానంలో శ్రీ చెన్నారెడ్డిగారు కడ గొట్టువారు.

ప్రాథమిక విద్యను స్వగ్రామంలోనే ఒక ముస్లిం ఉపాధ్యాయుని వద్ద ప్రారంభించి అక్కడికి సమీపగ్రామమైన కొలనుపాకలో విద్యాభ్యాసాన్ని పూర్తిచేశారు. ఉర్దూ మాధ్యమంగా ఆ రోజుల్లో విద్యాబోధన జరుగుతుండేది. మాతృభాష తెలుగును రెండోభాషగా బోధించేవారు. చెన్నారెడ్డి పెద్దఅన్నగారైన మాధవరెడ్డిగారు- ప్రముఖ కమ్యూనిష్టు నాయకులైన ఆరుట్ల రామచంద్రారెడ్డిగారు రాజకీయంగా చాలా సన్నిహితులు. సహోదరుడైన మాధవరెడ్డిగారి రాజకీయ కార్యకలాపాలపట్ల ప్రభావితుడైన శ్రీ చెన్నారెడ్డిగారు కమ్యూనిష్టు పక్షంలో చేరి నిజాం వ్యతిరేక పోరాటంలో పాలు పంచుకోసాగారు.

ప్రజావ్యతిరేకచర్యలైన వెట్టిచాకిరీ, లెవీధాన్యం వసూళ్లు- గీతపన్ను- అంటరానితనంపై రాజీలేని పోరాటానికి కమ్యూనిష్టు పార్టీ సంసిద్ధమైనప్పుడు ఆ తర్వాత సాయుధ పోరాటానికి సంసిద్ధమైన కమ్యూనిష్టు పార్టీ కార్యకర్తలకు సాయుధ శిక్షణను [illegible]టానికి సంసిద్ధమైనపుడు శ్రీ చెన్నారెడ్డి గారు అందులో చేరి సాయుధ శిక్షణను పొందారు.

శిక్షణను పూర్తి చేసుకొన్న చెన్నారెడ్డిగారు ఒకదళనాయకునిగా రజాకార్ దుండుగుల పీచమడంచటానికి సమకట్టి అబ్దుల్ రహీం అన్న రజాకార్ నాయకుణ్ణి మరికొందరు రిజర్వు పోలీసులను హతమార్చి మందు గుండుసామానుతోసహా వారి ఆయుధాలను చేజిక్కించుకున్నారు. పాముగుంటలో జరిగిన కార్యకర్తల సమావేశంలో ప్రధానమైన దళానికి నాలుగు వుపదళాలు యేర్పడ్డాయి. ఈ ఉపదళంలో ఒకదానికి శ్రీ చెన్నారెడ్డిగారు నాయకులు కాగా కేంద్రదళానికి శ్రీ రేని గుంట రామిరెడ్డిగారు నాయకులు. రేనికుంటలో జరిగిన ఎన్‌కౌంటర్‌లో సాయుధపోరాట యోధులు ఇరవై ఆరు మంది మరణించగా అరవైమంది ప్రభుత్వంచే పట్టుబడ్డారు. కామ్రేడ్ రేనిగుంట రామిరెడ్డిగారు ఈ ఎన్‌కౌంటరులోనే మరణించారు.

హైదరాబాదు సంస్థానం భారత్‌లో విలీనమైనతర్వాత కూడా 1949 వరకు శ్రీ చెన్నారెడ్డిగారు రైతాంగ సాయుధ పోరాటంలో వుండి ఆ తర్వాత వుద్యోగంలో చేరినా 1950లో మళ్లీ చెన్నారెడ్డిగారిని ప్రభుత్వం అరెస్టు చేసి 2మాసాల 6రోజులు పోలీసు కస్టడిలో వుంచారు. వయోవృద్ధులైన శ్రీచెన్నారెడ్డి గారు నేటికి మొక్కవోని పోరాటయోధులే!

## శ్రీమతి చెన్నారెడ్డి



# శ్రీ జగదీష్ ఆర్య

వీరు 1926లో హైదరాబాదు నగరంలోని గోషామహల్‌లో జన్మించారు. తండ్రి రావులవీరయ్య గారు. ఐదో తరగతి వరకు ఉర్దూమీడియంలో ప్రాథమిక విద్యను అభ్యసించారు. జీవనోపాధికోసం అటు ఇటు తిరుగుతూ మధ్య మధ్యలో గోషామహల్ లోని ఆర్యసమాజ్ మందిరానికి వెళుతుండెవారు. ఆర్యసమాజ కార్యక్రమాలు ఆయన్ను ఆకర్షించాయి. అక్కడ జరిగే అన్ని సత్సంగ్ గోష్ఠులకు హాజరయ్యేవారు. అప్పటికి హైదరాబాదు సంస్థానానికి చెందిన విద్యుత్ సంస్థలో ఉద్యోగం కూడా లభించింది. నిజాం సంస్థాన ఉద్యోగియై రాష్ట్రీయ గీతాన్ని ఆలాపించడం యువకులలో జాతీయ భావాలను రేకిత్తించడానికి పూనుకోవడంతో ప్రభుత్వం ఇతనిపై కన్ను వేసింది. ఫలితంగా వారెంటు జారి అయింది. అజ్ఞాతంలోకి వెళ్లడం జరిగింది. అందులో భాగంగా షోలాపూర్ వయనిస్తున్నపుడు నిజాం పోలీసులు వెంబడించారు. వారి బారి నుండి ఏదో విధంగా తప్పించుకుని అప్పటికీ అక్కడ మకాం చేసివున్న ప్రసిద్ధ ఆర్య సమాజ నాయకులు ఘటకేసర్ గురుకుల్ నిర్మాత సంచాలకులు అయిన బన్సీలాల్ వ్యాస్, రాజపాల్ ఆర్యా, రామ్ నివాస్ శర్మ, కొండా లక్ష్మణ్ బాపుజీ మొదలుగా గలపెద్దలను కలిశారు.

వారితో హైదరాబాదులో జరుగుతున్న దారుణాలను గూర్చి వివరించారు. ఏమి చేయాలని సలహా అడుగుతూ హైదరాబాదులో జరుగుతున్న రక్త పాతానికి హిందువులపై జరిగే అత్యాచారాలకు కారకుడైన రజాకార్‌నాయకుడు ఖాశిం రజ్వీని అంత మొందించడమే నా భవిష్యత్ కార్యక్రమమని వారికి తెలిపారు. ఆర్య చెప్పింది వారికి నచ్చినట్లుంది వెంటనే ఖాశింరజ్వీని ఎందుకు ఈ హత్యాకాండకు కారకుడైన ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ నే మొట్టమొదట అంతమొందిస్తే పోలా? అని సలహా ఇచ్చారు.

ఈ కార్యక్రమంలో శ్రీ ఆర్యాను, గండయ్యగార్లను శ్రీ నారాయణరావు పవార్ గారికి సహచరులుగా ఎంపిక చేశారు. ఆ విధంగా వారి ఆదేశం ప్రకారం షోలాపూర్ నుండి హైదరాబాదుకు వచ్చి 4-12-47న నిజాంపై బాంబు వేయడానికి ఉపక్రమించారు. ఆ రోజు మధ్యాహ్నం మూడు గంటలనుండే కింగ్‌కోఠి మార్గంలోని ఆయా కూడలి స్థలాల్లో శ్రీ నారాయణరావు పవార్- శ్రీ జగదీష్ ఆర్యా- శ్రీ గండయ్యగారలు వేరు వేరుగా నిజాం రాకకొరకై శక్తివంతమైన బాంబులతో గ్రెనేడ్‌లతో వేచి ఉన్నారు. కింగ్‌కోఠి మార్గాన ఆల్ సెయింట్స్ స్కూల్

ఉస్మాన్ అలీఖాన్‌పై బాంబును ప్రయోగించవలసి వుంది. సరిగ్గా 4.30 గం.ల సమయంలో పాతనగరంలోని తల్లి సమాధిని దర్శించి, ఆటుపైన నమాజుకు వెళ్లవలసి వున్న నిజాం నవాబు కారు అల్ సేయింట్సు స్కూల్ మీదుగా అబిడ్ సెంటర్‌లో ప్రవేశించి ప్రధాన రాజవీధులు గుండా పాత నగరానికి పయనించవలసి వుంది ఆరోజు 4-12-1947 న 4.30 గం. సమయంలో కారు అల్ సెయింట్సు స్కూల్ కూడలిలో ప్రవేశించగానే ఒక శక్తివంతమైన బాంబును కారులో వున్న నిజాం నవాబుపై శ్రీ నారాయణరావ్ పవార్ పేల్చారు. ఆ దెబ్బతో మీర్ ఉస్మాన్ అలీఖాన్ ఆరోజు చచ్చేవాడే గాని వెంట్రుక వాసిలో ప్రమాదం నుండి తప్పించుకున్నాడు. నిజాం వెంటనే తన ప్రయాణాన్ని రద్దు చేసుకొని తిరిగి వెళ్లాడు.

శ్రీ నారాయణ రావు పవార్‌ను పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారు. కారు యింకా ముందుకు సాగితే మలిదశలో శ్రీ జగదీష్ ఆర్య బాంబును ప్రేల్చవలసివుంది. ఆ దశలో కూడా నవాబు తప్పించుకోగలిగి కారు ముందుకు సాగితే శ్రీ గండయ్యకు బాంబు విసిరే అవకాశం లభించేది. కాని ఆ విధంగా జరగలేదు.

ఆ పిదప శ్రీ ఆర్యా ఆ రాత్రి బొల్లారంలో అజ్ఞాతంలో ఉండి- ఆ మరునాడు ఏదో విధంగా బొంబాయి వెళ్లి అక్కడ నుంచి షోలాపూర్ వెళ్లి జరిగిన సమాచారమంతా బన్సీలాల్ వ్యాస్ గారికి వివరించి వారితో కలసి పూనా ఆర్యసమాజానికి వెళ్లారు. అక్కడ శ్రీ దిగంబర్ రావు ఉత్తమ వార్, శ్రీ మోహన్ శర్మగారల పరిచయాలతో అక్కడి బన్సీలాల వాడి, ఎం. ఆబ [illegible] లామోనేకర్, సాహెబ్ రావు బరడ్‌కర్, అనంతబాలెరావ్, రంగనాథ్‌రావ్, నాగనాథ్ రావ్, దిగంబర్‌రావ్, కాశీనాథశెట్టి ప్రభృతులతో కలసి 31-1-1948 సా. 4.30 గం.లకు ఉమ్రీలోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌కు వేసుకున్న పథకం ప్రకారం భారత్ మాతాకు జై ఆర్య సమాజ్ కు జై అంటు గంజ్ మార్గాన పయనించి బ్యాంక్ దోపిడీలో పాల్గొన్నారు. ఆ విధంగా దోపిడీ చేసిన 21, 75,000 రూపాయలను కాంగ్రెస్ కార్యాలయంలో జమ చేసారు.

దీనికి ముందు శ్రీ జగదీష్ జబల్‌పూర్‌లో మిలట్రీ శిక్షణను పొందారు. వీరితోపాటు శిక్షణ పొందినవారిలో కవాడిగూడకు చెందిన కోదండం లక్ష్మీనారాయణ, గోషామహల్‌కు చెందిన మాణిక్ రావ్ వగైరాలు కూడా ఉన్నారు. శిక్షణానంతరం ఉమ్రీకి వచ్చి తిరుగు ప్రయాణంలో సింగారు వాడిలో రజాకార్లకు వీరికి మధ్య భీషణమైన పోరాటం జరిగింది. పోలీసు చర్య అనంతరం 1949 ఆగస్టు 10న శ్రీ జగదీష్ పైగల వారంటు ఎత్తివేయబడింది.

తదుపరి హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్‌లో రహదారుల ఇన్స్‌పెక్టర్‌గా ఉద్యోగం చేసి పదవీ విరమణ చేసారు. ప్రస్తుతం ఆర్యసమాజానికి తమ సేవలను అందిస్తున్నారు. 1949లో ఈయనకు శ్రీమతి లీలావతి గారితో మతాంతర వివాహం జరిగింది. ఆర్యసమాజ శతాబ్ది సందర్భంగా ఈయనకు కొత్తఢిల్లీలో సార్వదేశిక ఆర్యప్రతినిధి సభవారు జీవించి ఉన్న వీర యోధునిగా ఘనమైన సన్మానం చేశారు. ●





## శ్రీ కొత్త జంబుల్ రెడ్డి

## శ్రీమతి కొత్త సుభద్రమ్మ

శ్రీ కొత్త జంబుల్‌రెడ్డి గారు 1927 జూలై 20న మహబూబ్‌నగర్ (పాలమూర్) జిల్లా కొల్హాపూర్ తాలూకా కలువకోలు అనే జాగీరు గ్రామంలో శ్రీ కొత్తలక్ష్మిరెడ్డి, శేషమ్మ దంపతులకు జన్మించారు.

వీరి ప్రాథమిక విద్య స్వగ్రామమైన కలువకోలు గ్రామంలోనే జరిగింది. అటు తరువాత మాధ్యమిక విద్యను అప్పటి సంయుక్త మద్రాసు రాష్ట్రానికి చెందిన కర్నూల్ పట్టణంలోని ఒక ముస్లిం హైస్కూలులో పూర్తి చేశారు.

అనంతరము మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన వనపర్తి సంస్థానం హైస్కూలులో పదోతరగతి (హెచ్.యస్.సి.)ని హైదరాబాదు నగరంలో సిటీ కాలేజీలో ఇంటర్మీడియెట్ పూర్తిచేసారు. ఇంటర్ చదువుతున్న రోజులలో 1947 జూలై 30న ఆర్యసమాజ్ నాయకుడు పండిత నరేంద్రజీని నిజాం పోలీసులు అరెస్టు చేసి నిర్బంధములోకి తీసుకున్నపుడు నిజాంపాలనకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ఊరేగింపును తీశారు. ఆ ఊరేగింపులో శ్రీ జంబుల్‌రెడ్డి గారు పాల్గొని పోలీసుల లాఠీదెబ్బలను, బాష్పవాయు ప్రయోగాన్ని చవిచూచారు.

అటుపిమ్మట శ్రీ జంబుల్ రెడ్డి కళాశాల చదువుకు స్వస్తిచెప్పి స్వగ్రామం వెళ్లి అక్కడ కాంగ్రెసు నాయకుల ఆదేశం మేరకు త్రివర్ణ పతాకాలను ప్రతిష్ఠించడంతో పాటు ప్రభుత్వానికి పన్నులు చెల్లించవద్దని, లెవీ ధాన్యాన్ని ఇవ్వడాన్ని నిరాకరించమని, మద్యాన్ని సేవించవద్దని ఉద్బోధించి ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలకు ప్రజలను ఆయత్తం చేశారు. నిజాం పోలీసులు, రజాకార్ల దౌర్జన్య కాండను ఎదుర్కొంటూ చివరకు నిరంకుశ పాలనను అంతమొందించి హైదరాబాదు సంస్థాన ప్రజలను నిజాం బానిసత్వం నుండి విముక్తం చేయాలని నిశ్చయించిన స్టేట్ కాంగ్రెసు పక్షాన కాంగ్రెసు నాయకుడు శ్రీ పాగా పుల్లారెడ్డి నాయకత్వంలో కర్నూలుజిల్లా కాల్వబుగ్గలో ఏర్పాటైన సరిహద్దు పోరాట కేంద్రంలో సరిహద్దు పోరాట యోధునిగా కాలుమోపి నిజాం

వ్యతిరేక పోరాటాన్ని కొనసాగించారు శ్రీ జంబుల్ రెడ్డిగారు.

1948 సెప్టెంబర్ 17న భారత సైన్యాలు హైదరాబాదు సంస్థానంపై సైనిక చర్య జరిపి సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేసేంతవరకు సరిహద్దు పోరాట యోధునిగా నిజాం వ్యతిరేక ఉద్యమంలో పాల్గొని పనిచేసి ఆపిదప తిరిగి హైదరాబాదుకు వచ్చి ఉస్మానియా యూనివర్సిటిలో డిగ్రీ చదువును పూర్తిచేసి అటుపిమ్మట న్యాయశాస్త్రంలో పట్టభద్రులై 1955 నుండి మహబూబ్‌నగర్ జిల్లాలో ప్రముఖ న్యాయవాదిగా పేరుగడించారు.

1. 1955లో మహబూబ్‌నగర్ జిల్లా కాంగ్రేస్ కార్యవర్గ సభ్యులుగా ఎన్నికై కాంగ్రేసులో క్రియాశీల సభ్యులుగా పనిచేశారు.

2. 1959లో కొల్లాపూర్ తాలూకా పంచాయతీ సమితి సభ్యులుగా ఎన్నికయ్యారు.

3. అదే సంవత్సరములో కొల్లాపూర్ తాలూకా భూమి తనఖాబ్యాంకు అధ్యక్షులుగా పదవీ బాధ్యతలను నిర్వహించారు.

4. మహబూబ్‌నగర్ జిల్లా న్యాయ సహాయక సలహాసంఘ సభ్యులుగా పనిచేశారు.

5. తొమ్మిది సంవత్సరాలు ప్రభుత్వ ప్లీడర్‌గా పదవి బాధ్యతలు నిర్వహించారు.

6. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, ఆంధ్రా బ్యాంక్, సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్, సంగమేశ్వర గ్రామీణ బ్యాంక్‌లకు లీగల్ అడ్వయిజర్‌గా పదవీ బాధ్యతలు నిర్వహించారు.

7. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమర యోధుల సంస్థ కార్యనిర్వాహకవర్గ సభ్యులు గాను, స్వతంత్ర సంగ్రాం సైనిక్ సన్మాన్ సహకార గృహనిర్మాణ సంస్థ మేనేజింగ్ కమిటి సభ్యులుగాను పదవీ బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

8. కలువకోలు పెద్ద చెరువు జల వినియోగదారుల సంఘం అధ్యక్షులుగా ఎన్నికై రైతులకు నీటి వినియోగ వ్యవహార కార్య క్రమాలపై మార్గదర్శకులుగా వుంటున్నారు. •

జిల్లాల పేర్లమార్పు

**1905లో**

పాలమూరును-మహబూబ్‌నగర్‌గాను

ఇందూర్‌ను-నిజామాబాదుగాను

మెతుకును-మెదక్‌గాను

నిజాం ప్రభుత్వం మార్చింది





## శ్రీ వేదాంతం ధర్మాచార్య

శ్రీ వేదాంతం ధర్మాచారిగారు నల్లగొండ జిల్లా నకిరెకల్ మండలం మంగళంపల్లి గ్రామంలో వేదాంతం కృష్ణమాచారి నరసమ్మ దంపతులకు జన్మించారు. ప్రాథమిక విద్య స్వగ్రామమైన మంగళంపల్లి గ్రామంలోనే జరిగింది. శ్రీ ధర్మాచారి తల్లి ఆయన బాల్యదశలో వుండగానే పరమపదించడం వలన తండ్రి శ్రీ కృష్ణమాచార్యులవారి పెంపకములో అన్నదమ్ములు, చెల్లెండ్రతో పాటు పెరిగి పెద్దవారయ్యారు. ప్రాథమిక విద్యను స్వగ్రామంలో పూర్తి చేసిన శ్రీ ధర్మాచారిగారు అటు పిమ్మట తాలూకా కేంద్రమైన మిర్యాలగూడెంలో మాధ్యమిక విద్యను 7వ తరగతి వరకు అభ్యసించారు. ఆయన ఏడవ తరగతి చదువుచున్న సమయంలోనే 1947 ఆగష్టు 15న భారత దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించబడింది. కాని నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ మాత్రం హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో కలిపిపేది లేదు. హైదరాబాదు సంస్థానం స్వతంత్ర రాజ్యంగా వుంటుందని ప్రకటించుకొన్నాడు. ఆ కారణంగానే హైదరాబాదు సంస్థానంలో ఆర్యసమాజం- కాంగ్రెసు- కమ్యూనిష్టు పార్టీలు, 1947-48 సంవత్సరాల మధ్య కాలంలో హైదరాబాదు సంస్థాన విముక్తి పోరాటం జరపవలసి వచ్చింది. పోరాటాన్ని ఉధృతం చేయడానికై స్టేట్ కాంగ్రెసు విద్యార్థులను స్కూలు, కాలేజీలు బహిష్క రించమని పిలుపు నిచ్చింది. అప్పటికి నల్లగొండలో హైస్కూలు విద్యను అభ్యసిస్తూ విద్యార్థియూనియన్‌లను నిర్వహిస్తున్న శ్రీ వేదాంతం ధర్మాచారిగారు స్టేట్ కాంగ్రెసు పిలుపునునసరించి

## శ్రీమతి రూపాదేవి

ృతించి నిజాం వ్యతిరేక
* విద్యార్థి నాయకుడుగా

నికి నిజాం ప్రోత్సాహంతో
్యలు, ముస్లీం మతోన్మా
ర్ల నిజాం వ్యతిరేక
రుల పైన, గ్రామాల్లో
సృష్టించసాగారు. అత్యా
లూటీలు గృహదహనాలు
ు. వారి ఆగడాలకు
నిరంకుశ నిజాంను
రజాకార్లను ఎదిరించి
సంస్థానాన్ని వారికబంధ
విముక్తం గలిగించడానికి
టమే శరణ్యమని స్టేట్
్యానిష్టు పార్టీలు రెండూ
ంగ్రేసు పార్టీ ఆదేశం మేరకు
వాడ సమీపంలోని కమల్
స్టేటుగా వున్న పరిటాలకు
ర్థులతో శ్రీ ధర్మాచారిగారు
ఈ పరిటాల ఇండియాకు
గానే తనకు తాను స్వయం
ంకటించుకొన్న తొలి ఎస్టేట్.
హింద్ ఫౌజుకు చెందిన
ంద్రన్ వద్ద సాయుధ శిక్షణ

పొందారు. తదుపరి నల్లగొండ జిల్లాకు సరిహద్దు ప్రాంతమైన కృష్ణానదికి ఆవలిఒడ్డున వున్న గుంటూరు జిల్లా, గురజాడ తాలూకా తాళ్ళపల్లిలో శ్రీ యం.వి. రంగారెడ్డి నాయకత్వంలో నిర్వహింపబడిన సరిహద్దు పోరాట కేంద్రంలో కమాండర్‌గా చేరి గెరిల్లా యోధుడుగా నిజాం వ్యతిరేక పోరాటోద్యమం 1948 సెప్టెంబర్ 17న భారత సైన్యాలు సైనిక చర్య ద్వారా హైదరాబాదుకు విముక్తి కలిగించేంత వరకు పోరాటం సలిపారు. తాళ్లపల్లి క్యాంపులో వీరి సహచరులుగా శ్రీ మేడ రామచంద్రారెడ్డి, శ్రీ బుసిరెడ్డి నారాయణరెడ్డి, శ్రీ వెదిరె రమణారెడ్డి పోరాట యోధులుగా పనిచేశారు. ఆ తదుపరి తిరిగి నల్లగొండలో 1950లో హెచ్.ఎస్.సి పూర్తిచేసి అటు పిమ్మట ఇంటర్మీడియట్ విద్యను కూడా పూర్తిచేసి సాంఘిక సంక్షేమశాఖలో ఉద్యోగమందు ప్రవేశించారు. ఆ ఉద్యోగంలో అంచెలు అంచెలుగా జాయింటు డైరక్టర్ పదవి వరకు ఎదిగి 1991 మే 31న పదవీ విరమణ చేశారు. శ్రీ ధర్మాచారి గారికి 1952లో శ్రీమతి రూపాదేవిగారితో వివాహం జరిగింది.

ప్రస్తుతం వీరు హైదరాబాదులోని సలీంనగర్‌లో సతీమణి రూపాదేవి గారితో ప్రశాంతజీవనం గడుపుతున్నారు. ●





## శ్రీ దుర్గాజీ

## శ్రీమతి దుర్గాజీ

శ్రీ దుర్గాజీ అలియాస్ దుర్గయ్యగారు మెదక్ జిల్లా సదాశివపేటలో 1920లో శ్రీ ఓంకార నారాయణరావు రాధాబాయి దంపతులకు జన్మించారు. స్వగ్రామం సదాశివపేటలోనే ప్రాథమికవిద్యను అభ్యసించారు. అతి చిన్నవయస్సులోనే అంటే 12 సంవత్సరముల వయస్సులోనే ఆర్యసమాజ్ కార్యక్రమాల పట్ల ఆకర్షితులయ్యారు. ఆర్యసమాజంలో పనిచేస్తూ 1938 నాటికి ఆర్యసమాజం నిర్వహిస్తున్న నిజాం నిరంకుశ వ్యతిరేకపోరాటం పట్ల ఆసక్తిని పెంచుకున్నారు. శ్రీ దుర్గాజీ ఆ విధంగా ప్రభావితులు కావడానికి ముఖ్యంగా ప్రధానకారకులు మాష్టర్ శంకర్ రావు, వకీలు వెంకటేశం గారలు. అటుపిమ్మట ఆకాశం విశ్వనాథం గారు మరింత స్ఫూర్తిని ఇచ్చారు. వీరి అధ్వర్యములో 60మంది కార్యకర్తలు సమాజ్ కార్యక్రమాన్ని ఎంతో క్రమశిక్షణతో నిర్వహిస్తూ ఆర్యసత్యాగ్రహంలో పాల్గొన్నారు. అటు పిమ్మట 1942లో ఆగస్టు 9నుండి మహాత్మాగాంధీ పిలుపు మేరకు దేశవ్యాప్తంగా జరిగిన క్విట్ ఇండియా ఉద్యమంలో పాలుపంచుకొని జాతీయోద్యమ కార్యక్రమాలపట్ల తీవ్రమైన కృషి సలిపారు.

1947లో నిజాం వ్యతిరేకోద్యమం తీవ్రతరమైనప్పుడు ఆ ఉద్యమంలో ముమ్మరంగా నిజాం సర్కారుకు ముస్లిం మతోన్మాదులైన రజాకార్లకు వ్యతిరేకంగా పనిచేసి హైదరాబాదు విముక్తి ఉద్యమంలో పాల్గొని అరెస్టు కాబడి మెదక్ జిల్లా జైలులో సంగారెడ్డియందు కారాగారవాస శిక్షను అనుభవించారు. సతీ వియోగం కలిగాక పిల్లలతో పొట్టచేతపట్టుకొని హైదరాబాదు నగరం చేరి దర్జీపని (టైలర్) చేసుకుంటూ శేషజీవితాన్ని ఒడుదుడుకులతో గడుపుతున్న అభిమానధనుడు శ్రీ దుర్గాజీ. ఆర్యసమాజ్ తరపున స్వాతంత్ర్య సమరయోధులకిచ్చే పెన్షన్ల కొరకు ఏర్పాటయిన స్పెషల్ స్క్రీనింగ్ కమిటి సిఫారసు చేసినప్పటికిని కేంద్ర ప్రభుత్వం ఇంతవరకు వీరికి పెన్షన్ విడుదల చేయలేదు ●



## శ్రీ సుంకోజు (వడ్ల) నరసింలు

శ్రీ సుంకోజు (వడ్ల) నరసింలుగారు 1920లో మెదక్ జిల్లా, దుబ్బాక గ్రామంలో శ్రీ సుంకోజు వెంకటేశం- శ్రీమతి సరస్వతమ్మ దంపతులకు జన్మించారు. వీరిది విశ్వ బ్రాహ్మణుల కుటుంబం. వృత్తి వడ్రంగము శ్రీ నరసింలుగారి ప్రాథమిక విద్యాభ్యాసం హైదరాబాదులో మాతా మహుల ఇంటివద్ద జరిగింది. ఆ రోజుల్లోనే పండిత నరేంద్రజీ గారి ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న ఆర్యసమాజ్ కార్యక్రమాల పట్ల శ్రీ నరసింలు ఆకర్షితులయ్యారు ఆదే సమయంలో రెండవ ప్రపంచయుద్ధం ముమ్మరంగా సాగుతోంది. ప్రభుత్వం సైనిక స్థావరాలకోసం దామెరచర్ల, తునిగండ్ల ప్రాంతాలలో గృహనిర్మాణాలను చేపట్టింది. ఉపాధి కొరకు ఆ పనులలో నిమగ్నమైయున్న శ్రీ నరసింలు గారికి నిజామాబాదులోని ఆర్యసమాజ నాయకులు శ్రీ చిలుక మల్లయ్యగారితో పరిచయం ఏర్పడింది.

ఆర్యసమాజ్ నాయకులు నిజాం ప్రభుత్వానికి, అతనివిధానాలకు రజాకార్లకు వ్యతిరేకంగా ముమ్మరమైన ఉద్యమాన్ని నిర్వహించారు. అందులో శ్రీ చిలుక మల్లయ్య గారు కూడా ఒకరు. శ్రీ చిలుక మల్లయ్యగారితోపాటు శ్రీ నరసింలు గారుఆర్యసమాజం పక్షాన నిజాం ప్రభుత్వా నికి వ్యతిరేకంగా ఎదురొడ్డి నిలిచారు. 1946 లో జాల్నాలో జరిగిన ఆర్యప్రతినిధి సభకు హాజరైన శ్రీ నరసింలుగారు సభ ఆదేశం మేరకు నిజాం వ్యతిరేక కార్యకలాపా లను తీవ్రతరం చేశారు.



## శ్రీమతి బాలమ్మ

ఇంతలో 1947ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. హైదరాబాదు సంస్థాన ప్రజలకు స్వాతంత్ర్యం లభించలేదు. నిజాం హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేయబోనని ప్రకటించాడు. నిజాం ప్రోత్సాహంతో మతోన్మాదులైన రజాకార్ల దాష్టీకం హైదరాబాదు సంస్థానమం దంతటను ఎక్కువైంది. నిజాం పోలీసులు, రజాకార్లు చేస్తున్న అత్యాచారాలకు భయభీతులైన ప్రజలు సురక్షిత ప్రాంతాలకు వెళ్లసాగారు. ఆ స్థితిలో నిజాం పోలీసుల, రజాకారుల అత్యాచారాలను అడ్డుకోడానికి శ్రీ నరసింలు చిలుక మల్లయ్య గారితోపాటు నిర్మల్, బోథ్, ఆదిలాబాద్ ప్రాంతాలలో అజ్ఞాతంగా వుండి సాయుధులైన నిజాం పోలీసులను, రజాకార్లను ఎదుర్కొంటూ రజాకార్ల దుశ్చర్యలు పేట్రేగి పోవడంతో అక్కడ నుండి తిన్నగా బొంబాయికి వెళ్లి బొంబాయిలో, హైదరాబాదు ప్రజలకు సహాయక చర్యలను చేపట్టారు. 1948 సెప్టెంబర్ 17న హైదరాబాదు సంస్థానం పై భారతసైన్యాలు సైనిక చర్య జరిపి సంస్థాన మును భారత్‌లో విలీనం చేశాక బయటకు వచ్చి కుటుంబ వ్యవహారాలను చూచు కుంటూ ప్రస్తుతం ఆర్యసమాజ్ కార్యక్రమా లను నిర్వర్తిస్తూ నిజామాబాదులో స్థిరపడి ప్రశాంత జీవనం గడుపుతున్నారు. ●




1922 మార్చి 12న శ్రీ యన్. నరసింహులు దోమకొండలో జన్మించారు. శ్రీ నరసింహులు ఎనిమిదేండ్ల వయస్సులో వున్నపుడు ఆయన తల్లి దండ్రులు ఉపాధి కొరకై 1930లో హైదరాబాదుకు వచ్చారు. ఆ విధంగా హైదరాబాదుకు చేరుకున్న శ్రీ నరసింహులు తల్లిదండ్రులు ఇపుడు మోజంజాహిమార్కెటు వున్న ప్రాంతంలో స్థిరపడ్డారు. అప్పట్లో మొజాంజాహి మార్కెట్ నిర్మాణంలో వుండేది. ఆదే ప్రాంతంలో నాంపల్లి వైపుకు వెళ్లుతుండగా రోడ్‌కు కుడివైపున కట్టెలమండికి సమీపంలో జీవరక్షకప్రచారక మండలి కార్యాలయం వుండేది. అక్కడ జీవరక్ష ప్రచారక మండలి నాయకుడు పండిత కృష్ణ స్వామి నాయుడుగారు తరచు జంతుహింసకు వ్యతిరేకంగాను, నిజాం ప్రభుత్వ కిరాతక చర్యలకు వ్యతిరేకంగాను చేస్తున్న ఉపన్యాసాలు శ్రీ నరసింహులు గారిని ఆకర్షించాయి. ఆ కార్యక్రమాలలో భాగస్వామి అగుటకు దోహదపడ్డాయి.

నిజాం కిరాతక పాలనకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేసిన శ్రీ నరసింహులు, బందేరావు వర్తక్, రామ్మూర్తినాయుడు గారలను నిజాం పోలీసులు అరెస్టు చేసి చంచల్‌గూడా,ముషిరాబాద్, నిజామాబాద్ జైళ్లలో ఎనిమిదినెలలపాటు నిర్బంధించారు. 1948 సెప్టెంబర్‌న అర్ధరాత్రి రెండు మూడు గంటల మధ్య పోలీసుల కన్నుగప్పి సుల్తాన్ బజార్ క్లాక్ టవర్‌పై మూడు రంగుల జాతీయ జండాను ప్రతిష్ఠించారు.

అప్పటి శ్రీ నరసింహులు గారి నాయకులు శ్రీ కృష్ణస్వామినాయుడు, శ్రీ బాలిరెడ్డి, శ్రీ కె.సి గుప్త, స్వామి రామానాంద తీర్థ, పండిత నరేంద్రజీ, శ్రీ నారాయణరావు పవార్, శ్రీ మధుపాఠక్, శ్రీ పార్లేకర్, శ్రీ బాలకృష్ణ, శ్రీ రాధాకృష్ణదత్తు ఇంకా ఇతర సహకార్యకర్తలు చంచల్‌గూడా జైళ్లో నిర్బంధించబడివుండిరి.

రెండో దశలో జరిగిన ఈ పోరాటంలో శ్రీ నరసింహులు అజ్ఞాత యోధులుగా పనిచేశారు.

సోషలిస్టునేత శ్రీ జయం ప్రకాశ్ నారాయణజీ 1947 జూన్‌లో హైదరాబాదు ను సందర్శించినపుడు వారికి స్వాగతం చెప్పడానికి జీవరక్షా ప్రచారక్ మండలి కార్యకర్తలతో బేగంపేట విమానాశ్రయానికి వెళ్లారు. హైదరాబాదు సికిందరాబాదు నగరాల ప్రధాన కూడలుల ద్వారా సోషలిస్టు నాయకుడు శ్రీ మహదేవ సింగ్ ఇంటివద్దకు ఊరేగింపుతో వెళ్లారు. కర్బలా మైదానంలో శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారు చేసిన మహత్వపూర్వకమైన ఉపన్యాసం పూర్తయ్యేంతవరకు స్వచ్ఛందసేవకునిగా పని చేయడమే గాకుండా శ్రీ జయప్రకాశ్ నారాయణగారి హైదరాబాదు ప్రవేశాన్ని నిజాం సర్కార్ నిషేధించినందుకు సుల్తాన్ బజార్‌లో సహచర కార్యకర్తలతో సత్యాగ్రహం చేశారు. పోలీసులు శ్రీ నరసింహులును ఇతర కార్యకర్తలను అరెస్టు చేసి నిర్బంధంలోకి తీసుకున్నారు. జైల్లో పెట్టారు. ప్రస్తుతం తాళపు చేతుల రిపేరి కార్యక్రమాన్ని తాళపు చేతుల అమ్మకాన్ని హోల్‌సేల్ గాను రిటైల్ గాను విక్రయం చేస్తూ వ్యాపారం కొనసాగిస్తున్నారు. వీరివద్ద 50 మందివరకు తాళపు చేతులను తయారీ చేయుడంలోను, తాళాలను రిపేరు చేయడంలోను శిక్షణ పొంది స్వయం ఉపాధి కార్యక్రమాలను కొనసాగిస్తూ జీవిస్తున్నారు. వారిలో కొందరు ముస్లింలు కూడా వున్నారు.

శ్రీ నరసింహులుగారికి నలుగురు కుమారులు కూడా ఇదే వృత్తిలో కొనసాగు తున్నారు. ప్రస్తుతం మూసారాంబాగ్ లోని చిన్న కుమారునివద్ద ప్రశాంతజీవనం గడుపుతున్నారు. ●

**భాషానిలయాలు**

*1901లో హైదరాబాదులో శ్రీ కృష్ణదేవరాయాంధ్రా భాషానిలయం.*

*1904లో హనుమకొండలో రాజరాజ నరేంద్ర ఆంధ్రా భాషానిలయం.*

*1905లో సికిందరాబాదులో తెలుగుభాషా సంవర్ధనీ గ్రంథాలయాలు ఏర్పాటయ్యాయి.*



# శ్రీ నూనెముంతల నరసింహులు

శ్రీ నూనెముంతల నరసింహులుగారు నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా "కాప్రాయిపల్లి" అను గ్రామంలో శ్రీ నూనెముంతల యల్లయ్య, మంగమ్మ దంపతులకు 1922లో జన్మించారు. చదువులేదు. అయినా నిజాం సర్కారుకు వ్యతిరేకంగా ధూళిపాల్ల సత్యారెడ్డిగారి నాయకత్వంలో నిర్వహించిన సత్యాగ్రహం లో పాల్గొన్నారు. 22-12-1946లో 60మంది నిజాం వ్యతిరేక పోరాటయోధులతో కాప్రాయిపల్లిలో బురుజు వద్ద జాతీయ జెండాను ఎగురవేసి సత్యాగ్రహము చేశారు.

1. వెట్టి చాకిరిని రద్దు పరచాలి 2. రైతులు ప్రభుత్వానికి లెవీధాన్యాన్ని చెల్లించవద్దు 3. మద్యాన్ని నిషేధించాలి. 4. కాంగ్రేసుకు జై- కమ్యూనిష్టు పార్టీకీజై అనే నినాదాలు చేశారు. ఈ విషయాన్ని పోలీసు పటేల్ మోత్కూర్ పోలీసుస్టేషన్ సబ్ ఇన్స్పెక్టర్‌కు తెలియజేశారు. దాని ఆధారంతో యఫ్.ఐ. ఆర్.ను తయారుచేసి 1-1-1947న భువనగిరి ఫస్టుక్లాస్ మెజిస్ట్రేట్ కోర్టులో క్రిమినల్‌కేసును దాఖలా చేయగా భువనగిరి మేజిస్ట్రేట్ 8-1-1947న సెక్యూరిటి చట్టంలోని 33,37 సెక్షన్లల క్రింద వారంటు జారిచేశారు. 8-1-1947 నుండి 4-6-1947 వరకు శ్రీ నరసింహులు ఆయన సహచర పోరాటయోధులు అజ్ఞాతంలో వుండి నిజాం సర్కారుకు వ్యతిరేకంగా విధ్వంసక కార్యక్రమాల్లో పాల్గొనిరి. 5-6-1947న శ్రీ నరసింహులును ఆయన సహచరకార్య కర్తలను అరెస్టుచేశారు. తదుపరి 10-6-1947 నల్లగొండజిల్లా జైలుకు తీసుకువెళ్లి పోలీసులు అక్కడ నిర్బంధించారు. భువనగిరి ఫస్టుక్లాసు మేజిస్ట్రేట్ శ్రీ నరసింహులు గారిని రాజకీయ నేరస్థుడుగా ధృవీకరిస్తూ ఇచ్చిన తీర్పు ఈ విధంగా వుంది.

1. కేసు నం. 8/1/1357 ఫసలీ

2.విధించబడిన శిక్ష - సెక్యూరిటీ చట్టం క్రింద33,37 మరియు 58 సెక్షన్ల ప్రకారం పీనల్ కోడ్ 164 సెక్షన్ ప్రకారం 22-12-1356న శిక్ష విధించారు.

3. అరెస్టు అయిన తేది 5-6-1357 ఫసలీ

4. జైలుకు పంపిన తేది 10-6-1357 ఫసలీ

5. విడుదల చేసిన తేది 21-7-1357 ఫసలీ

6. కేసును పూర్తిగా రద్దుచేసిన తేది 9-3-1358 ఫసలీ.

శ్రీ నరసింహులుగారు పోలీసు కాల్పులలో ఒక కాలును పోగొట్టుకున్నారు. ప్రస్తుతం కవాడిగూడలో భార్యాసహితంగా జీవనం సాగిస్తున్నారు.




మద్రాసు ప్రెసిడెన్సీలో బ్రిటిష్ వ్యతిరేక వుద్యమం ముమ్మరంగా జరుగుతున్న రోజులవి. విద్యార్థులు తమ విద్యాభ్యాసాన్ని, న్యాయవాదులు తమ న్యాయవాద వృత్తిని, విడనాడి దేశ స్వాతంత్ర్యంకోసం కంకణ ధారులైనారు.

ప్రకాశం జిల్లా గిద్దలూరు తాలూకా అనుమలవీడు గ్రామంలో 1922లో జన్మించిన శ్రీనారాయణరెడ్డిగారు 1942 సంవత్సరం వచ్చేనరికి ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయులుగా వుండేవారు. తండ్రి పోలిరెడ్డిగారు. బొంబాయి చౌపతి మైదానం నుండి జాతిపిత మహాత్మాగాంధి బ్రిటిష్ వారిని భారతదేశం విడిచిపొమ్మని నినదించటంతో యావద్భారత ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వాన్ని స్తంభింపజేయటం స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో కీలకమైన ఘట్టంగా చెప్పుకోవచ్చు. ఆ మహోజ్జ్వల చరిత్రకు తానూ వారసుడుగా శ్రీ నారాయణరెడ్డిగారు ఉపాధ్యాయవృత్తిని తృణప్రాయంగా భావించి వదలి పెట్టారు. అప్పటి జిల్లా కాంగ్రెస్‌నాయకులుగా ప్రసిద్ధిచెందిన శ్రీ పిడతల రంగారెడ్డిగారి నాయకత్వంలో పన్నుల నిరాకరణోద్యమంలో శ్రీ నారాయణరెడ్డిగారు సత్యాగ్రహం చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం దీనిని నేరంగా భావించి 2-11-1942న నారాయణ రెడ్డిగారిని అరెస్టుచేసి ఆరుమాసాలపాటు కఠిన కారాగారవాస శిక్షను విధించి అలీపూర్ జైలులో బంధించింది. జైలు నుండి విడుదలై తిరిగి కర్నూలు జిల్లా బోర్డులో వుపాధ్యాయునిగా చేరి ఉద్యోగ విరమణ చేశారు.

ఎనిమిదవ పదిలో వున్న శ్రీ నారాయణ రెడ్డిగారు మండలకేంద్రమైన గిద్దలూరులో స్థిరనివాసమేర్పరుచుకొని శేషజీవితాన్ని సతీమణి నారాయణమ్మ గారితో ప్రశాంతంగా గడుపుతున్నారు.




శ్రీ సురిగుచ్చి నారాయణమూర్తి గారు ప్రకాశం జిల్లా. చీరాల వాస్తవ్యులు, వీరి తండ్రి శ్రీ వేంకట వీరభద్రశాస్త్రిగారు. వీరి బావ డాక్టర్ ఏ.బి. నాగేశ్వర రావుగారు రాజమండ్రి వాస్తవ్యులు, వారు సుప్రసిద్ధ గాంధేయవాదులు. ఆయన యొక్క బోధనల వల్లను, జాతీయ భావాలు గల ఇతర స్వాతంత్ర్య సమరయోధుల ప్రేరణ వల్లను చదువుకు స్వస్తిచెప్పారు. శ్రీ నారాయణ మూర్తిగారు భారతస్వాతంత్రోద్యమ కార్య క్రమాల్లో పాల్గొని అనంతరం స్వగ్రామానికి తిరిగి వెళ్లారు. అక్కడ క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 26-1-1943 నుండి 12-2-1943 వరకు ఒంగోలు సబ్‌జైలులో పార్లమెంటు మాజీసభ్యుడు శ్రీ పి.వి. రాఘవయ్యగారితో వున్నారు. జైలునుండి విడుదలయ్యాక 14-2-1943 నుండి 25-10-1943 వరకు అజ్ఞాతంలో వుండి వివిధ ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాల్లో పాల్గొని ప్రజలను బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా చైతన్యవంతులను చేశారు.

1945లో ఆజాద్ హింద్‌ఫౌజ్ నాయకులపై ఢిల్లీలోని ఎర్రకోటలో బ్రిటిషు ప్రభుత్వం విచారణ జరిపినందుకు దేశమంతటా ప్రదర్శనలు జరిగాయి. స్వాతంత్ర్య పిపాసువులైన యువకులు ఎందరో చీరాల రైల్వేస్టేషన్‌పై దాడిచేసి తగుల బెట్టారు. వారిలో శ్రీ నారాయణ మూర్తి గారు కూడా వున్నారు. 7/46 నంబర్‌లో సి ఆర్ పిసి క్రింద చీరాల పోలీసు స్టేషన్ హౌస్ ఆఫీసర్ చార్జి షీటు దాఖలు చేయగా బాపట్ల సబ్ జైలులో అండర్ ట్రయల్ ప్రిజనర్‌గా శిక్షను అను భవించిన స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ నారాయణ మూర్తిగారు. తదువరి ఉపాధ్యాయ వృత్తిలో కామర్సు విభాగంలో జూనియర్ లెక్చరర్‌గా స్థిరపడి పదవీ విరమణ చేశాక భార్య ప్రసూనాంబ, కుమార్తె అనూరాధలతో చీరాల పాపరాజు తోటలోని 3వ నంబరు మునిసిపల్ క్వార్టర్‌లో నివాసముంటూ ప్రశాంతజీవనం సాగిస్తున్నారు.



## శ్రీ బుసిరెడ్డి నారాయణ రెడ్డి



## శ్రీమతి బుసిరెడ్డి విమలాదేవి

శ్రీ బుసిరెడ్డి నారాయణరెడ్డిగారు 1930మార్చి 5న నల్లగొండ జిల్లా, సర్వారం గ్రామం శివారు గ్రామం అయిన "బుసిరెడ్డి గూడెం"లో శ్రీ బుసిరెడ్డి వెంకటరెడ్డి- రాధమ్మ దంపతుల చివరి సంతానం.

శ్రీ నారాయణ రెడ్డిగారి తోబుట్టువులు ఏడు మంది. వారు శ్రీయుతులు లక్ష్మీ నరసింహ్మారెడ్డి, గోపాలరెడ్డి, రంగారెడ్డి, కొండల్‌రెడ్డి, శ్రీమతులు సూదమ్మ, రంగమ్మ, రాంరెడ్డి, చివరివారు శ్రీ నారాయణరెడ్డి. వీరి పూర్వీకులు 200 సంవత్సరాల క్రితం రాయలసీమ ప్రాంతంనుండి తెలంగాణ ప్రాంతానికి చెందిన నల్లగొండ జిల్లాకు వలస వచ్చినట్లు తెలుస్తున్నది. వలనలో భాగంగా శ్రీ నారాయణరెడ్డి గారి పూర్వీకులు ఆయా ప్రాంతాల్లో తిరుగుతూ తిరుగుతూ ఇపుడు శ్రీ నారాయణరెడ్డిగారి కుటుంబం స్థిరపడిన "బుసిరెడ్డిగూడెం" అనువైన ప్రదేశంగా ఎంచుకొని వారు అక్కడ స్థిరపడిపోయారు. బుసిరెడ్డివారు ఆ గ్రామాన్ని నిర్మాణం చేసినందున దానికి "బుసిరెడ్డిగూడెం" అనే పేరు వచ్చింది. ప్రస్తుతం ఈ గ్రామం తిప్పర్తి మండలంలో వుంది. భూసంపద, పశుసంపద బాగా ఒనగూడినప్పటికి కాలక్రమేణ బుసిరెడ్డి వారి కుటుంబం బహుజన కుటుంబంగా మారడం వలన ఆ కుటుంబ పోషణా భారపు ఇబ్బందులు శ్రీ నారాయణరెడ్డి గారి తల్లి దండ్రులకు ఎక్కువయ్యాయి.

ఆ స్థితిలో శ్రీ నారాయణరెడ్డి గారి మూడవ అన్న శ్రీ రంగారెడ్డిగారు చదువు కోవాలన్న ఆసక్తితో ఇంట్లో ఎవ్వరికీ చెప్ప కుండా 16 సంవత్సరాల వయస్సులో కాలినడకన బయలుదేరి మూడురోజులు 130 కిలోమీటర్ల దూరం నడిచి హైదరా బాదుకు చేరుకున్నారు.

హైదరాబాదులో రెడ్డి హాస్టలు సంస్థాప కులు శ్రీ రాజబహద్దూర్ వెంకట రామిరెడ్డిగారిని దర్శించి వారితో చదువు కోవాలన్న తనలోని ఆసక్తిని శ్రీ రంగారెడ్డి తెలియజేశారు. అప్పట్లో శ్రీ వెంకట రామారెడ్డిగారు హైదరాబాదు నగర పోలీసు కమీషనర్‌గా వుండేవారు. అపుడు శ్రీ వెంకటరామారెడ్డిగారు హాస్టల్‌లో శ్రీ రంగా రెడ్డికి వసతి కల్పించి రాత్రిపూట చదువు కొనునట్లున్ను పగటి పూట బుక్‌బైడింగ్

తయారీ కార్యక్రమాన్ని చేపట్టమని ఆదేశించారు. శ్రీ వెంకటరామిరెడ్డి గారి ఆదేశం మేరకు శ్రీ రంగారెడ్డిగారు ఒక సంవత్సరం పాటు ప్రభుత్వ ముద్రణాలయంలో బుక్‌బైడింగ్ పనిని నేర్చుకొన్నారు. ఆ పిదప శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు స్థాపించిన గోల్కొండ ప్రెస్‌లో తలదాచుకుంటూ స్వయం ఉపాధి కార్యక్రమంగా రెడ్డి హాస్టల్ తాలుకు పుస్తకాలు బైడింగ్ చేసి యివ్వడం ప్రారంభించారు. వాటిని చక్కటి నాణ్యత కలిగినవాటిగా తయారు చేసి ఇచ్చినందున శ్రీ వెంకటరామారెడ్డిగారు శ్రీ రంగారెడ్డిగారిని కొంతమంది న్యాయవాదులకు పరిచయం చేయడంతోపాటు సిటి ఇంప్రూవ్‌మెంటు బోర్డు క్రింద ఆగాపురలో నిర్మాణం చేయబడిన ఇళ్లలో ఒక ఇల్లును కూడా ఇప్పించారు. ఆ ఇంటి నుండి స్వయం ఉపాధి కార్యక్రమాన్ని ప్రారంభించి క్రమంగా దానిని మూడుపువ్వులు ఆరుకాయలుగా విస్తృత పరిచారు శ్రీ రంగారెడ్డిగారు.

ఆ స్థితిలో శ్రీ నారాయణరెడ్డిగారిని తన అన్న రంగారెడ్డి గారు 1939 సం॥లో చదువుకొరకు హైదరాబాదుకు తెచ్చారు. ఆ విధంగా హైదరాబాదు వచ్చిన శ్రీ నారాయణ రెడ్డిగారు 1947 నాటికి పదోతరగతికి చేరుకున్నారు. పదోతరగతి చదువుతున్న రోజుల్లో 'హిందూడైనాసిటి - ముస్లీం డైనాసిటి- బ్రిటిష్‌డైనాసిటి- ఇంపీరియలిజం, అను అంశాలపై చరిత్ర అధ్యాపకులైన శ్రీ గోవిందరావుగారు విపులీకరించి బోధించేవారు. అప్పటికి హైదరాబాదు సంస్థానంలో కాంగ్రేసు - కమ్యూనిస్టు పార్టీల గూర్చిన అవగాహన అందరికీ అంతగా తెలియదు. తెలిసిందల్లా ఆర్య సమాజం గురించి మాత్రమే. ఒకవైపు చరిత్ర అధ్యాపకులు శ్రీ గోవిందరావుగారి చరిత్ర బోధనలు- మరొక వంక ఆర్యసమాజ నాయకుడు పండిత నరేంద్రజీగారి ఉపన్యాసాలు శ్రీనారాయణ రెడ్డిగారిని ఆకట్టుకొని నిజాం వ్యతిరేక పోరాటానికి ఆసరానిచ్చాయి.

అలాంటి స్థితిలో 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. హైదరాబాదు చుట్టూరవున్న భారత ప్రజలు స్వాతంత్ర్యోత్సవ వేడుకలు జరుపుకుంటుంటే హైదరాబాదు సంస్థాన ప్రజలకు ఆ సంబరాలు లేవు. పైగా హైదరాబాదు సంస్థానం భారత్‌లో విలీనం కాదు. అది స్వతంత్ర దేశంగానే వుంటుంది అని నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ ప్రకటించడం మొత్తం సంస్థాన ప్రజలకు సంతాపాన్ని కలుగజేసింది. అదే సమయంలో ముస్లిం మతోన్మాదులైన రజాకార్లను హిందువులపై దౌర్జన్యాలు గృహదహనాలు అత్యాచారాలు జరుపుటకు ప్రోత్సహించింది. దానితో నిజాం పోలీసులు, రజాకార్లు సంస్థానమంతటా విజృభించి నానాబీభత్సం చేయసాగారు. ఆ స్థితిలో అటు స్టేట్ కాంగ్రేసు, ఇటు కమ్యూనిస్టు పార్టీలు నిజాం ఆగడాలను అరికట్టుటకు ఉవ్వెత్తున ఉద్యమాలు లేవదీశారు. అందులో భాగంగా విద్యార్థులను పాఠశాలలను బహిష్కరించ వలసిందని ఆ పార్టీలు పిలుపునిచ్చాయి. ఆ పిలుపు మేరకు శ్రీ నారాయణ రెడ్డిగారు పాఠశాల విద్యకు

స్వస్తి చెప్పి విజయవాడకు అక్కడ కాంగ్రెసు నాయకత్వంలో శ్రీ హయగ్రీవాచారి గారి నేతృత్వంలో పనిచేస్తున్న సరిహద్దు పోరాట కేంద్రంలో పనిచేయుటకు బయలుదేరారు. దారిలో ఖమ్మం- మధిర వద్ద నిజాం పోలీసులు, రజాకార్లు వచ్చీపోయే బాట సార్లపై నిఘా వుండేవారు. తనపై నిఘావేసిన పోలీసులతో తాను కూలిపనిపై విజయవాడ వెళుతున్నట్లు పోలీసులతో చెప్పి ఎట్లానో నెమ్మదిగా విజయవాడ చేరుకున్నారు శ్రీ నారాయణ రెడ్డిగారు.

విజయవాడలో కొన్ని కరపత్రాలు తీసుకొని మునగాల పరిగణాలోని రేపాలలో శ్రీ కోదాటి నారాయణ రావుగారి నాయకత్వంలో పనిచేస్తున్న సరిహద్దు పోరాట కేంద్రానికి చేరారు.

ఆ పిదప కృష్ణానదికి ఆవల గుంటూరు జిల్లా గురజాల తాలుకాకు చెందిన తాళ్లపల్లి గ్రామంలో శ్రీ యం.వి. రంగారెడ్డిగారి నేతృత్వంలో నడుస్తున్న సరిహద్దు పోరాట కేంద్రంలో సరిహద్దు పోరాట గూఢచారిగా బాధ్యతలు స్వీకరించారు. చాకలి, గొల్ల, ఎరుకల వేషాలతో దుస్తులు మార్చుకుంటూ గ్రామాల్లోకి వెళ్లి సమాచారాన్ని సేకరించి దానిని పోరాట కేంద్ర నాయకులకు అప్పగించేవారు. తర్వాత పోరాట యోధులు ఆ గ్రామంలో సభలు సమావేశాలు నిర్వహించడంతోపాటు పోలీసుల, రజాకార్ల బారి నుండి ప్రజలకు రక్షణ చేకూర్చేవారు.

పెరువాల, చింతకుంట్ల, నెరడిగొమ్ము, పనకరాజుపల్లి, మల్లారం, గూడుమడక పాతనూరు, యంగన్నగూడెం, యంపహాడ్ పాలం, అన్నారం, గుంటిపల్లి, గ్యారకుంట పాలెం, కన్నెకల్లు, తదితర గ్రామాలకు వెళ్ళి

ఈ సందర్భంగా రాయారం, సిడిగల్లు పోలీసు స్టేషన్లపై కూడా దాడిచేశారు. అందువలన నిజాం సర్కార్ తదుపరి అక్కడి పోలీసు స్టేషన్లను ఎత్తివేసింది.

మతోన్మాదులైన ఖాసీం రజ్వీ నాయకత్వంలోని రాజాకార్లు విరుచుకుపడుటతో సంస్థాన ప్రజలపై 17 సెప్టెంబర్ 1948న భారత సైన్యాలు నిజాం సంస్థానంపై సైనిక చర్య జరిపి హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేశాయి.

ఆటుపిమ్మట స్వేచ్ఛగా బయటకు వచ్చి 1949 ఏప్రిల్‌లో హెచ్.ఎస్.సి పూర్తి చేసి తర్వాత నగర శివార్లలోని నాదర్‌గుల్‌లో ఉపాధ్యాయవృత్తిని చేపట్టారు. తదుపరి వారి బంధువు వెదిరె శ్రీనివాసరెడ్డి గారి ప్రోత్సాహంతో టీచర్ ఉద్యోగాన్ని వదలి పై చదువుకై సిటి కాలేజీలో ఇంటర్ మీడియట్‌లో చేరారు. తరువాత ఆర్థిక ఇబ్బందులవలన ఇంటర్ మీడియట్ ఛదువును మానివేసి సివిల్ ఇంజనీర్ డిప్లమాను ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పొంది 1954లో రోడ్లు, భవనాల శాఖలో సబ్ ఓవర్ సీర్‌గా చేరారు. అదే సంవత్సరం విమలాదేవిగారితో వివాహం జరిగింది. ఉద్యోగరీత్యా శ్రీ నారాయణరెడ్డి గారు నల్లగొండ, హైదరాబాదు, ఖమ్మంలో పనిచేశారు. అంచెలు అంచెలుగా అసిస్టెంట్ ఇంజనీర్ పదవి వరకు ఎదిగి ప్రస్తుతం హైదరాబాదు మలక్‌పేట కాలనీలో సతీమణి విమలాదేవిగారితో ప్రశాంత జీవనం గడుపుతున్నారు. ●



# శ్రీ నారాయణ రావు పవార్

వీరు చరిత్ర ప్రసిద్ది గాంచిన వరంగల్ పట్టంలో జన్మించారు. తదుపరి హైదరాబాదు నగరంలో నివాసం ఏర్పరచుకున్నారు. ఆ రోజుల్లో మజ్లీస్ రజాకార్లు చేస్తున్న దుండగాలు దౌర్జన్యాలు, మానభంగాలు, మహిళల అపహరణాలు, బలవంత మత మార్పిడులు చూచి వీరికి ఒళ్ళుమండింది. వీరికి అప్పట్లో జగదీష్ ఆర్యా, శ్రీ గండయ్యా, జి. నారాయణ స్వామి, శ్రీ బాలకిషన్, రెడ్డి పోచాద్ మొదలుగా గల వారు సన్నిహితులుగా ఉండేవారు. వీరికి పండిత నరేంద్రజీ ఆదర్శప్రాయులు. వీరు అప్పుడప్పుడు నరేంద్రజీని కలుసుకొని, హైదరాబాదు సంస్థానంలో జరుగుతున్న దారుణాలను, దహన కాండలను గూర్చి చర్చించేవారు. వీటన్నింటికి ప్రధాన కారకుడు నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్, అని నిశ్చయించుకున్నారు.

అప్పుడు శ్రీ నారాయణ రావు పవార్ మిత్రులకు సింగపూర్ నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఇచ్చిన ఉపన్యాసాల సంపుటిని చదివి వినిపించారు. అందులో "మీరు రక్తం ఇయ్యండి నేను స్వాతంత్ర్యం తెస్తాను" అనే కొటేషన్ దర్శనమిచ్చింది. దానితో రక్తం కార్చందే హైదరాబాద్ విముక్తం కాదని అందుకు నిజామును చంపడానికే నిశ్చయించారు.

అందువలన 1947 డిశంబర్ 4న కింగ్ కోఠి మార్గంలో ఆల్ సెయింట్స్ స్కూల్ మలుపులో తమ అనుచరులు శ్రీ జగదీష్ ఆర్య, శ్రీ గండయ్య గారలతో నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్‌పై శ్రీ నారాయణరావు పవార్ బాంబును ప్రయోగించారు. అది విఫలంకాగా ఆయన్ను పట్టుకొని చావ గొట్టారు. కేసు జరిగింది. నిజాంపై హత్యా ప్రయత్నాన్ని శ్రీ పవార్ ఒప్పుకొన్నారు ఫలితంగా 4-12-1947నుంచి 18-12-1947 వరకు పోలీసు కస్టడీలోను ఆ పిదప 19-12-1947 నుండి 26-3-1948 వరకు జుడిషయల్ కస్టడిలో ఉంచబడ్డారు 27-3-1948న, సెషన్స్ కోర్టు ఉరిశిక్షను విధించింది. దానిని హైకోర్టు నిజాం జుడిషయిల్ కమిటీ ధృవీకరించింది. ఇంతలో హైదరాబాద్‌పై పోలీసు చర్య జరిగి నిజాం దుష్టకౌగిలి నుండి సంస్థానం విముక్తమైంది. మిలటరి గవర్నర్ మేజర్ జనరల్ చౌదరి ఉరిశిక్షను యావజ్జీవకారాగార శిక్షగా మార్చాడు. దాని కారణంగా 27-3-1948నుండి 10-8-1949 వరకు సెంట్రల్ జైల్లో 21 మాసాలపాటు కారాగార క్లేశాన్ని అనుభవించి వినాయక రావ్ విద్యాలంకార్, పండిత నరేంద్రజీ, స్వామిరామానందతీర్థ ఇతర ప్రజా సంస్థల ఆందోళనలతో 1949 ఆగష్టు 10న జైలు నుండి విడుదల చేయబడ్డారు.

తదుపరి న్యాయశాస్త్రంలో పట్టభద్రులై ఆంధ్రప్రదేశ్ భూమి తనఖాబ్యాంక్ మేనేజర్ పరసోనెల్, మరియు ఛీఫ్ విజిలెన్స్ ఆఫీసర్ గాను కార్యదర్శిగాను పదవీ బాధ్యతలను నిర్వహించి పదవీ విరమణ చేశాక ప్రస్తుతం ఆర్యసమాజ సేవలో నిమగ్నులై వున్నారు. ●





## శ్రీ కైరంకొండ నారాయణ

శ్రీ కైరంకొండ నారాయణగారు 1916లో నిజామాబాదులో శ్రీ కైరంకొండరామయ్య లచ్చవ్వ దంపతులకు జన్మించారు. వీరు పద్మశాలి వంశస్థులు వృత్తి చేనేత వృత్తి. వీరు శ్రీ చిలుక మల్లయ్యగారికి బాల్య మిత్రులు శ్రీ చిలుకమల్లయ్య, శ్రీ వడ్ల (సుంకోజు) నరసింహులు గారివలెనె వీరును ఆర్యసమాజకులు. నిజాం పాలనాకాలంలో వృత్తినికొనసాగించుకుంటూనే శ్రీనారాయణ గారు ఆర్య సమాజ కార్యక్రమాల్లో పాల్గొనెడివారు.

నిజాం ప్రభుత్వానికి ఆర్యసమాజకు లంటే బద్ధవైరం. శ్రీ నారాయణగారు తమ మిత్రులు శ్రీ మల్లయ్య, శ్రీ నర్సింహులు తోపాటు నిజాం ప్రభుత్వ విధానాలను ఖండిస్తూ ప్రభుత్వ వ్యతిరేకకార్యక్రమాలను నిర్వర్తించెడివారు. శ్రీ చిలుకమల్లయ్య , శ్రీ నరసింహులు గారలతోపాటు, నిర్మల్, బోధ్, ఆదిలాబాద్ ప్రాంతాలకు వెళ్ళి నిజాం వ్యతిరేక కార్యక్రమాలను ముమ్మరం చేస్తూ 1946లో జాల్నాలో జరిగిన ఆర్యసమాజ్ మహా సభలకు ప్రతినిధిగా వెళ్లి సభలలో పాల్గొన్నారు. 1947 ఆగస్టు 15న భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని నిజాం సంస్థాన ప్రజలకు స్వాతంత్ర్యం ప్రకటించబడలేదు. పైగా నిజాం

## శ్రీమతి వెంకుబాయి

హైదరాబాదు సంస్థాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చెయ్యబోనని హైదరాబాదు స్వతంత్రదేశంగా పాలిస్తానని ప్రకటించాడు. సంస్థాన ప్రజలపై పోలీసులతోపాటు మతోన్మాదులైన రజాకార్లను ఉసికొలిపారు. రజాకార్లదాష్టీకం రాష్ట్రమంతటాపెచ్చుపెరిగింది. వారు పెట్టే కష్టాలకు, చేసే అత్యాచారాలకు ఓర్చుకోలేని ప్రజలు సురక్షితప్రాంతాలకు వలస వెళ్లసాగారు. ఈ చర్యలను తీవ్రంగా ప్రతిఘటిస్తూ తిన్నగా అజ్ఞాతంలోకి వెళ్లి అటునుండి శ్రీ చిలుకమల్లయ్య శ్రీ నరసింహులు గార్లతో కలిసి బొంబాయి చేరుకున్నారు. అంతకు ముందే శ్రీ మల్లికొమరయ్య, శ్రీ దర్జి గంగారాంగారి నాయకత్వంలో శరణార్థులుగా బొంబాయికి చేరుకున్న సంస్థాన ప్రజలకు కామటిపురం లోని ఆర్యగల్లీ,మున్నూర్‌వాడిలో శ్రీ మల్లయ్య, నరసింహ్మలు గారలతో వుంటూ శరణార్థుల సహాయక కార్యక్రమాలకై ధాన్యాన్ని ధనాన్ని ప్రోగు చేసారు.

పోలీసు చర్య అనంతరం నిజామాబాద్‌కు తిరిగివచ్చి అక్కడ స్థిరపడి వృద్ధాప్య జీవనం గడుపుతున్నారు. వీరి వయస్సు ఇపుడు 82 సంవత్సరాలు. ●




కృష్ణాజిల్లా బందరు తాలూకా బైరాగి పాలెంలో 1915 జూలై 17న జన్మించారు. ప్రస్తుతం బందరు నివాసి. పత్రికా రచయిత. ఉప్పుసత్యాగ్రహ శిబిరంలో వాలంటీరుగా పనిచేశారు. కోనేరు జండా ప్రతిష్ఠాపన సమయంలో పోలీసులు చేసిన దౌర్జన్యాలను గూర్చి ప్రచారం చేస్తుండగా లాకప్‌లో ఉంచి కొట్టి 10 రోజుల తర్వాత విడిచి పెట్టారు. రెండవ ప్రపంచయుద్ధ కాలంలో పశ్చిమగోదావరి జిల్లా కొమరాడలో అరెస్టు చేసి పాలకొల్లు తీసుకువెళ్ళి అక్కడ వదిలిపెట్టారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా నర్సాపురంలో మూడు కేసులు పెట్టి రెండు కేసులలో మొత్తం 18నెలల కఠినకారాగార శిక్ష విధించారు. అలీపూర్ క్యాంపుజైలులోను బళ్ళారి జైలులోను ఆ శిక్షను అనుభవించారు. హైదరాబాదు సంస్థానంలో వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా భాగ్యరెడ్డి వర్మగారితో కలిసి పనిచేసినందుకు నిజాం స్టేట్ నుంచి బహిష్కరించబడ్డారు 1946లో రజాకార్ల రాక్షసకృత్యాలను విచారించేందుకు అప్పటి హైదరాబాదు సంస్థానపు తెలంగాణా ప్రాంతంలో సంచరిస్తున్నపుడు జిన్నారెడ్డి ప్రతాపరెడ్డిచే బంధించబడి ఎర్రపహాడు కోటలో నిర్బంధించబడిన ముగ్గురిలో శ్రీ నిరీక్షణ రావు ఒకరు. తర్వాత ప్రజాందోళన వలన వీరిని వదిలేశారు. 1956 నుండి భాగ్యనగర్ పత్రికకు సంపాదకత్వ బాధ్యను నిర్వహిస్తున్నారు. ఈ స్వాతంత్ర్య సమర వీరుడు ఎనభై సంవత్సరాలునిండిన పండు జీవితంలో అస్వస్థతకు గురై యెటూకదల లేకుండా వున్నారు. స్వాతంత్ర్యం కొరకు తనతోపాటు ఎందరో మహానుభావులు చేసిన త్యాగాలు వృథాకాకూడదని ఈ త్యాగమూర్తి నిరంతరం తనలో తాను సంస్మరించు కుంటూ కాలం గడుపుతున్నారు. వీరి సంస్మరణ ఫలించి మనదేశ సాతంత్ర్యం చిరకాలం వర్థిల్లుగాక !



## శ్రీ జి. పిచ్చిరెడ్డి



## శ్రీమతి సుశీలమ్మ

శ్రీ జి. పిచ్చిరెడ్డిగారు 1926లో నల్లగొండజిల్లా సూర్యాపేట తాలూకా నాగారం గ్రామంలో గుంటకండ్ల లచ్చిరెడ్డి-రామక్క దంపతులకు జన్మించారు. వీరికి ముగ్గురు సోదరులు ఇద్దరు చెల్లెండ్రు కలరు. అందరిలో పెద్దవారు శ్రీ పిచ్చిరెడ్డిగారె.

1936లో శ్రీ పిచ్చిరెడ్డిగారు వీరి సమీపబంధువు శ్రీకోట కృష్ణారెడ్డిగారితోకలసి సూర్యపేట ప్రాథమిక పాఠశాలలో 3వ తరగతిలో ప్రవేశించారు. ఆరోజుల్లో నిజాం సంస్థానంలో బోధనా భాషగా ఉర్దూ వుండేది. ప్రాథమికవిద్య, మాధ్యమికవిద్య పూర్తిచేసి హైస్కూలువిద్యలో ప్రవేశించి పదవ తరగతికి చేరుకునే సమయానికి హైదరాబాద్ సంస్థానంలో "హైదరాబాదు స్టూడెంట్సు యూనియన్" బలపడి నిరంకుశ నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేయసాగింది. స్టూడెంట్సు ఉద్యమంలో శ్రీపిచ్చిరెడ్డిగారు ప్రవేశించారు. అవి రెండో ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులు కూడా.

అంతకుముందు ఆర్యసమాజస్థానిక శాఖనుండి సామాజికోద్యమంపట్ల ప్రభావితులైన శ్రీ పిచ్చిరెడ్డిగారు ఆ పిదప ఆంధ్ర మహాసభ కార్యక్రమాల పట్ల ఆకర్షితులయ్యారు. "ఆంధ్రమహాసభ" అనుసంస్థ ఆంధ్రుల అభ్యున్నతికై ఏర్పరచబడిన సాంస్కృతిక సంస్థ. 1944లో శ్రీ రావినారాయణరెడ్డిగారి అధ్యక్షతన భువన గిరిలో జరిగిన 11వ ఆంధ్రమహాసభకు యువకుడుగా అత్యంత ఉత్సాహంతో హాజరైన శ్రీపిచ్చిరెడ్డిగారు అటుపిమ్మట వెట్టిచాకిరికి వ్యతిరేకంగాను, కౌలురేట్లు రద్దుకావాలని, కౌలుదార్లను బేదఖల్ చేయరాదని, భూమిని సాగుచేసుకుంటున్న వారికే పట్టాలివ్వాలని, జాగీర్దారీ విధానాన్ని రద్దుచేయాలని, సర్వే సెటిల్‌మెంటులను నిర్బంధంగా అమలు చేయాలని, హక్కే మాలికానా పేర కల్లుగీసే చెట్లపై విధించే పన్నులు రద్దు చేయాలని, బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు కావాలంటూ ఆంధ్ర మహాసభ డిమాండ్లను తీవ్రతరంచేసే ఉద్యమంలో శ్రీ పిచ్చిరెడ్డిగారు ప్రముఖ పాత్ర వహించారు. దాయం రాజిరెడ్డి మొదలుగా గలవారు వారి సహచర

కార్యకర్తలు బెంగాల్ కరువు సహాయ నిధికి విద్యార్థిగా స్వచ్ఛంద సేవకునిగా పనిచేసి విరాళాలు సేకరించి జమకట్టారు.భువనగిరి ఆంధ్రమహా సభ వరకు కాంగ్రేసు, కమ్యూనిస్టు పార్టీలు నిజాం నిరంకుశ పాలనకు, రజాకార్ల మతోన్మాదానికి వ్యతిరేకంగా కలసేపని చేశాయి. భువనగిరి మహాసభ అనంతరం ఆంధ్రమహాసభ రెండుగా అంటే మితవాదులుగా కాంగ్రేసు, అతివాదులుగా కమ్యూనిష్టు పార్టీ చీలి పోవటం జరిగింది.కమ్యూనిస్టుపక్ష నాయ కుడు శ్రీ రావి నారాయణరెడ్డిగారి పట్ల ఆకర్షితులైన శ్రీ పిచ్చిరెడ్డిగారు అప్పటి నుండి కమ్యూనిస్టు ఉద్యమకార్యకర్తగా పనిచేస్తూ, చదువుకు పూర్తిగా స్వస్తిచెప్పి శ్రీరావి నారాయణరెడ్డి, ధర్మభిక్షము, దేవులపల్లి వేంకటేశ్వర రావుగారు ప్రభృతుల నేతృత్వం లో నిజాం నిరంకుశపాలనకు వ్యతిరేకంగా గెరిల్లాపోరాట (1945 నుండి 1948 వరకు) యోధుడుగా హైదరాబాదు సంస్థాన విముక్తి పోరాటం సాగించారు.

1948లో సెప్టెంబర్ 17న భారత సైన్యాలు హైదరాబాదు సంస్థానంపై సైనిక చర్య జరిపి హైదరాబాదు సంస్థానం నిజాం కబంధ హస్తాల నుండి విముక్తం పొందాక కూడా శ్రీపిచ్చిరెడ్డిగారు కమ్యూనిస్టు పార్టీ తీర్మానం మేరకు 1951 చివరి వరకు జరిగిన రైతాంగ సాయుధ పోరాటంలో పాల్గొన్న ప్రముఖులలో ఒకరు. ఆ సందర్భంలో అరెస్టు చేయబడి హైదరాబాదు, గుల్బర్గా, జాలనా జైళ్లలో 1949 నుండి రెండు సంవత్సరముల 1 మాసం శిక్షను అనుభవించారు.

1952 సాధారణ ఎన్నికల ముందుజైలు నుండి విడుదల కాబడ్డారు. జైలు నుండి విడుదలయి వచ్చాక 1952లో మరొక పోరాట సహచరిణి శ్రీమతి సుశీలమ్మ గారితో శ్రీ పిచ్చిరెడ్డిగారి వివాహం జరిగింది. ఈమె బాలవితంతువు కావటంవల్ల శ్రీ పిచ్చి రెడ్డిగారు సంఘసంస్కరణవాదులుగా ఆదర్శ ప్రాయులయ్యారు.

నూతనంగా ఏర్పడిన మూడంచల పంచాయితీ రాజ్‌వ్యవస్థలో సూర్యాపేట తాలూకా నాగారం పంచాయితీ సమితికి అధ్యక్షులుగా ఎన్నోకోబడి ఆనమితి పరిధిలోని గ్రామాల అభ్యున్నతికి అవిరళ మైన కృషిగావించారు. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు, శ్రీపిచ్చిరెడ్డిగారి పెద్ద అల్లుడు శ్రీ కె. శ్రీనివాస రెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ ప్రెస్ ఎకాడమీ అధ్యక్షులే గాకుండా అఖిల భారత జర్నలిస్టుల యూనియన్ సెక్రటరీ జనరల్‌గా కూడా పదవీ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. డెబ్బయిరెండు సంవత్స రాల వయస్సులో ఇప్పటికీ రైతాంగ సమస్యల పట్ల అవి శ్రాంతంగా శ్రమిస్తునే స్వగ్రామం నాగారం గ్రామంలో సతీమణి సుశీలాదేవిగారితో ప్రశాంతంగా కాలంగడుపుతున్నారు. ●



## శ్రీ పెంటయ్య



## శ్రీమతి పెంటయ్య

శ్రీ పెంటయ్యగారు హైదరాబాదులో 1919 జనవరి 26న జన్మించారు. తండ్రి లింగయ్యగారు - శ్రీ పెంటయ్య గారు 19 సంవత్సరాల వయస్సులో 1938-39 సంవత్సరములో నిరంకుశ నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగాను, అధిక సంఖ్యాకులైన హిందువులపై అల్ప సంఖ్యాకులైన నిజాం నవాబు సంస్థానంలోని ముస్లీం మతోన్మాదులైన రజాకార్లకు వ్యతిరేకంగాను, నిజాం సర్కారు పతనానికి నిర్వహించబడిన ఆర్య సత్యాగ్రహ ఉద్యమంలోను ప్రవేశించి 1938-39 సంవత్సరాలలో సత్యాగ్రహం చేశారు. ఫలితంగా హైదరాబాదు ఐ.పి.సి సెక్షన్ 122 మరియు సెక్షన్ 26(ఎ) క్రింద ఆరు మాసాల జైలు శిక్షవిధించటం జరిగింది.

తదుపరి హైదరాబాదులోని సెంట్రల్ జైలులో 16-8-1348 ఫసలీ నుండి 28-8-1348 ఫసలీ వరకు కఠిన కారాగార శిక్షను అనుభవించారు. అనంతరం ప్రభుత్వం తనంతట తానే 28-8-1348 ఫసలీ నాడు శ్రీ పెంటయ్యగారిని జైలు నుండి విడుదల చేసింది. 16-11-1967 హైదరాబాదు సెంట్రల్ ప్రిజన్ జైలు సూపరింటెండెంట్ శ్రీ పెంటయ్య గారి గురించి జారీ చేసిన సర్టిఫికెట్ ఈ విధంగా వుంది.

**Office of the Jail Superintendent**
**Central Prison, Hyd**

Date : 16-11-1967

CERTIFICATE

This is to certify that Shri Pentaiah, S/o Shri Lingaiah was admitted in this Jail on 16-8-1348 Fasali. He was convicted in the Jail and sentenced u/s 26(A) Dastur-Ul-Amul to for RCs 6 months. He was further convicted and sentenced u/s 122 of Tazriath to RCs for 6 months. He was released form this Jail on 28-8-1348 Fasali. His Jail No. was 4681.

Signature of the Supdt.
Central Prison, Hyderabad.

శ్రీ పెంటయ్యగారి వయస్సు ప్రస్తుతం 78 సంవత్సరాలు .ఇంతటి వయోవృద్ధులైనను జీవన నౌకను ముందుకు సాగించడానికి తన వృత్తి ధర్మాన్ని నిర్వహిస్తూ ప్రశాంతంగా సతీమణితో హైదరాబాద్ చుడిబజార్‌లోని 14-6-185 నంబర్‌గల ఇంటిలో కాపురం వుంటూ ప్రశాంత జీవితం గడుపుతున్నారు. ●




రాయలసీమ జిల్లాలలో సోషలిస్టు కార్యకర్తలుగా వున్న అతి తక్కువ మందిలో శ్రీపిడతల బసిరెడ్డిగారు ముఖ్యులు. ప్రకాశం జిల్లా గిద్దలూరు తాలూకా నర్సిరెడ్డి పల్లె గ్రామంలో 1925 సంవత్సరంలో సాధారణమైన రైతు కుటుంబంలో జన్మించారు. తండ్రి గంగిరెడ్డిగారు. శ్రీ బసిరెడ్డి గారు యువకుడుగా వుండగా గాంధీ మహాత్ముని 'క్విట్ ఇండియా' పిలుపు విని చదువు సంధ్యలు వదలి బ్రిటిష్ వ్యతిరేక వుద్యమంలో పాల్గొని అరెస్టుగావింపబడ్డారు. 17-10-1942 నుండి 20-11-1942 వరకు అల్లీపురంకాంపు జైలులో శిక్షను అను భవించారు. జైలు నుంచి విడుదలై విద్యార్థి కాంగ్రెసు నాయకుడుగా విద్యార్థుల లో జాతీయ భావాలు కలిగించటానికి విశేషమైన కృషి చేశారు.

ఆ తరువాత శ్రీ బసిరెడ్డిగారు శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌గారి సోషలిస్టు భావాల పట్ల ఆకర్షితులై ఆ పార్టీలో చేరారు. కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం యేర్పడినప్పుడు సోషలిస్టు పార్టీ నేతృత్వంలో ఈనాందారీల రద్దు కొరకు కరివెన గ్రామంలో గొప్ప సత్యాగ్రహ వుద్యమం జరిగింది. శ్రీ బసిరెడ్డిగారు ప్రస్తుతం గిద్దలూరు మండలం నరవ గ్రామంలో సతీమణితో ప్రశాంత జీవనం గడుతున్నారు.

**ఉస్మానియా యూనివర్శిటీలో వందేమాతరం ఆందోళన**

*1938లో ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు "వందేమాతరం ఉద్యమాన్ని చేపట్టారు.*




శ్రీ కోలాహలం బలరామరాజుగారు కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని పెనుగంచిప్రోలు గ్రామంలో 24-3-1931లో శ్రీ కోలాహలం నారాయణరాజు- మహాలక్ష్మమ్మ దంపతులకు జన్మించారు. ఈ పెనుగంచిప్రోలులోనే ప్రముఖ చరిత్ర పరిశోధకులు, బహుగ్రంథ కర్త అయిన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు జన్మించారు. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు జన్మించిన గ్రామంలో జన్మించిన శ్రీకోలాహలం బలరామరాజుగారు ధన్యులు.

బలరామరాజుగారి తల్లితండ్రిది చాలాపేద కుటుంబం, ఆయుర్వేద వైద్య వృత్తి చేసుకొంటూ పొట్టపోసుకొనేవారు. ఇంతపేద స్థితిలో వున్నా శ్రీ బలరామరాజు గారి తండ్రిలో దేశభక్తి మిన్న. జాతిపిత మహాత్మాగాంధీ త్యాగనిరతినిగూర్చి ఆయన చేపట్టిన స్వాతంత్రోద్యమమును గూర్చి వినడంతోపాటు, పత్రికల్లో కూడా చదివే వారు. ఆ విషయాలనే చిన్న తనంలో శ్రీ బలరామరాజుకు కూడా చెబుతుండేవారు. అవే శ్రీ బలరామరాజు గారిలో స్వాతంత్ర్యోద్యమం పట్ల బీజరూపం దాల్చాయి.

1946లో మహాత్మా గాంధీ మద్రాసులో జరిగిన దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మహాసభలకు వెళ్ళి తిరిగి వార్ధా వెళుతూ తెలంగాణాలోని మధిరలో (ఖమ్మంజిల్లా) కాసేపు ఆగి ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తారని తెలుసుకొన్నారు. తండ్రి నారాయణ రాజుతో పాటు తనయుడు బలరామరాజు కూడా మధిరకు వెళ్లారు. అక్కడ మహాత్ముని వుపదేశం విని బలరామరాజుగారు పూర్తిస్థాయి కాంగ్రెస్ కార్యకర్తగా మారి పోయారు.

అప్పటినుంచి బలరామరాజుగారు శ్రీయుతులు జమలాపురం కేశవరావు, బొమ్మకంటి సత్యనారాయణ, మిరియాల నారయణ గుప్తా, శాఖమూరి నారాయణ వంటి పెద్దలతో సన్నిహితంగా మెలగడం జరిగింది. ఇంతలో గాంధీమహాత్ముడు పయనిస్తున్న ప్రత్యేకరైలు మధిరకు రానే వచ్చింది. అపుడు శ్రీ కోలాహలం బలరామ

రాజు గాంధీ మహాత్ముణ్ణి పెద్దల వెంట వుండి దర్శించుకొనే భాగ్యం కలిగింది. తండ్రి బోధనల వలన బలరామరాజులో బీజరూపంగా వున్న స్వాతంత్రేచ్ఛ ఆనాటి నుండి దృఢరూపం దాల్చింది. ఆటుపిమ్మట ఉదారహృదయులైన శ్రీ నాగేశ్వరరావుగారు బలరామరాజును ఆయన వెంట ఖమ్మం తీసుకువెళ్ళగా అక్కడ కాంగ్రెసు కార్య కలాపాలలో పాల్గొంటూనే, హిందీని, మెట్రిక్ పరీక్షను ప్రయివేటుగా చదవటం ప్రారం భించారు. ఆ విధంగా శ్రీ నాగేశ్వర రావుగారి అండదండలతో ఖమ్మం, మధిర, ఇల్లెందు, కొత్తగూడెం కల్లూరు, తల్లాడ, వేంసూరు సత్తుపల్లి మొదలుగా గల గ్రామాలలో కాగ్రెసు కార్యక్రమాలను శ్రీ నాగేశ్వరరావుగారితో కలసి నిర్వహించేవారు.

ఇంతలో బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాను ఇండియా- పాకిస్థాన్‌గా విభజించి స్వతంత్ర్యం ప్రకటించడంతో పాటు ఇండియాలో వున్న సంస్థానాలను వారి వారి ఇష్టానికి వదలటంతో నైజాంనవాబు ఇదే అదను అనుకొని హైదరాబాదు స్వతంత్రదేశంగా ప్రకటించుకొన్నాడు. పైగా స్వాతంత్రోద్యమకారులపైనను, ప్రజల పైనను ఖాశీంరజ్వి నాయకత్వంలోని రజాకార్లను రెచ్చగొట్టి ఢిల్లీ ఎర్రకోటపై ఆసఫ్‌జాహి జండాను ఎగురవేయనున్నట్లు ఖాశీంరజ్వీచే ప్రకటింపజేశాడు. కాంగ్రెసు నాయకుల ఆదేశానుసారం 15 ఆగస్టు1947న బోనకల్లు సమీపంలోని నోముల గ్రామంలో అప్పటి ఖమ్మం తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ శాఖమూరి నారాయణ, వట్టిపల్లి రామకోటీశ్వరరావు గార్లతో కలిసి సత్యాగ్రహం చేశారు. చింతకాని పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ నాయకత్వంలో పోలీసులు పై ముగ్గురిని అరెస్టుచేసి వరంగల్ సెంట్రల్ జైయిలుకు పంపారు. అప్పటికి బలరామ రాజు వయస్సు కేవలం 16 సంవత్సరాలు జైలులో పెట్టే అన్నం పురుగులతో కలసి వుండటమే కాకుండా సరిపోయేది కూడా కాదు. అపుడు శ్రీ యం. యస్. రాజలింగం గారి ఆధ్వర్యంలో సత్యా గ్రహులందరూ జైలు అధికారులపై తిరుగు బాటు చేసి విజయం సాధించారు. తదుపరి కేసు ఖమ్మం మునసబ్ కోర్టులో విచారింపబడి పై ముగ్గురికి ఒక సంవత్సరం తొమ్మిది మాసాలు జైలు శిక్ష విధించారు. తిరిగి వరంగల్ సెంటర్‌జైలుకు తేబడి అక్కడ పూర్తికాలపు శిక్షను అనుభవించారు.

1948 సెప్టెంబర్ 17న భారతసైన్యాలు నిజాం సంస్థానాన్ని స్వాధీనం చేసుకున్నాక బలరామరాజును జైలు నుండి విడుదల చేశారు. అప్పటి నుండి ఇప్పటివరకు సేవా కార్యక్రమాల్లో పాల్గొంటూ ప్రస్తుతం ఖమ్మం జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంస్థ ప్రధాన కార్యదర్శిగా సమరయోధుల సమస్యలకు కృషి చేస్తు వారి సతీమణి శ్రీ మతి దమయంతిదేవిగారితో ప్రశాంతంగా ఖమ్మంలో జీవితాన్ని కొనసాగిస్తున్నారు. ●




ఈనాడు స్వగ్రామంలో ప్రశాంతంగా జీవిస్తూ గ్రామ ప్రజల కష్టసుఖాలలో పాలు పంచుకుంటూ సామాన్య రైతుగా జీవిస్తున్న చవ్వాబాలిరెడ్డిగారు, జాతీయోద్యమ కాలంలో అవిశ్రాంతంగా పర్యటిస్తూ జిల్లా ప్రజలను జాగృతం చేసిన ప్రజానాయకుడు.

1940లో, ఉన్నత పాఠశాల విద్యార్థిగా వుండిన బాలిరెడ్డిగారు, గాంధీజీ శంఖారావంచే ప్రభావితుడై పెద్దజూటూరులో వ్యక్తి సత్యాగ్రహం చేసి 5నెలల జైలు శిక్ష అనుభవించారు.

"క్విట్ ఇండియా" ఉద్యమకాలంలో ప్రాంతీయ కార్యనిర్వాహకుడుగా నియమింపబడినారు. జిల్లాలోని పల్లె లన్నిటిలో పర్యటించి "కరేంగే యా మరేంగే" పోరాడుదాం లేదా మరణిద్దాం అంటూ యువతను నిద్రలేపారు. కారా గారంలో 18 నెలల శిక్ష అనుభవించారు. ఆంధ్ర కేసరితోపాటు జైలు జీవితం గడిపారు.

ఆచార్య రంగా నాయకత్వంలో రాష్ట్ర కాంగ్రెస్ కమిటి సభ్యులుగా పనిచేశారు. దేవిరెడ్డి రామసుబ్బారెడ్డిగారు జిల్లా కాంగ్రెస్ కమిటి అధ్యక్షులుగా బాలిరెడ్డిగారు కార్యదర్శిగా పనిచేశారు.

1947లో కడప చేనేత కాంగ్రెస్ ,రాష్ట్ర కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు సభ్యులుగా పనిచేశారు. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారితోపాటు కాంగ్రెస్ సంస్థ పటిష్ఠతకు పనిచేశారు. ప్రకాశం,పట్టాభిగార్లకు అత్యంత సన్నిహితులుగా మెలిగారు. చిన్నవయసు లోనే రాష్ట్రస్థాయి నాయకత్వం వహించినా అత్యంత నమ్రతతో, నిస్వార్థ చిత్తంతో పనిచేశారు.

కక్షలకు, కార్పణ్యాలకు పేరుమోసిన పులివెందుల తాలూకాలోని గ్రామాలన్నిటిలో పర్యటిస్తూ, శాంతి సంఘాలను ఏర్పాటు చేస్తూ, పల్లెప్రజల జీవన వికాసానికి ఎనలేని కృషి చేశారు. జిల్లాశాంతి సంఘ నిర్వాహకులయ్యారు. సదా తగాదాలతో సతమతమౌతున్న రైతులపక్షాన యేడాది లోగా వీరికృషి వల్ల 170 లక్షల రూపాయలు పొదుపు చేయటం ప్రభుత్వం దృష్టికి వచ్చింది.

జిల్లాలో గ్రామాలకు రహదార్లు పలు చోట్ల ఉన్నత పాఠశాలల స్థాపనకు వారెంతో కృషి చేశారు. అచ్చువెల్లి గ్రామంలో కరువు నివారణ సభ ఏర్పాటు చేసిన నాటి మేటి నాయకులైన కల్లూరు సుబ్బారావు పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, దామోదరం సంజీవయ్య గార్లను సభలో పాల్గొనేటట్లు చేశారు. రెండుమార్లు ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్ సభ్యులుగా పనిచేశారు.

1962లో ఎన్నికల పోటీకి కాంగ్రెస్ టిక్కెట్ ఇవ్వనందున స్వతంత్ర అభ్యర్థిగా, పి. బసిరెడ్డిగారిని ఎదుర్కొని ఘన విజయం సాధించారు.

34 మంది శాసన సభ్యులుగల యునైటెడ్ డెమాక్రటిక్ సంఘానికి ఉపాధ్యక్షులుగా శాసనసభలో, రాయలసీమ ప్రజల సమస్యల కోసం పోరాడారు.

1968లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి కార్యదర్శిగా నియమింపబడినారు. తిరుమల తిరుపతి దేవస్థానం పాలకవర్గ సభ్యులు, శ్రీశైలం దేవస్థానం, పాలకవర్గ సభ్యులుగా పనిచేస్తూ తిరుపతిలో గోవింద రాజస్వామి కళాశాల కడప పులి వెందులలో కళ్యాణ మండపాల నిర్మాణాన్ని సాధించారు.

రాయలసీమలో ఆధునిక వ్యవసాయ పద్ధతులగురించి రైతులకు తెలుపుతూ రైతు శ్రేయస్సుకు పాటుపడినారు. నేడు 77 ఏళ్ళ వయసులో వున్న చవ్వా బాలిరెడ్డిగారు నానాటికి తరగుతున్న నైతిక విలువల పట్ల బాధను వెల్లడిస్తూ గ్రామసీమల సంక్షేమానికి శక్తివంచన లేక కృషి చేస్తున్నారు. ●

## సరిహద్దు పోరాటం

*1942లో సాగిన క్విట్ ఇండియా ఉద్యమం నడిచిన తీరులోనే నిజాం సర్కారును కూలద్రోయడానికి సరిహద్దు పోరాట ఉద్యమం నడపాలని 1947లో స్టేట్ కాంగ్రెస్ నిర్ణయించింది. సంస్థానంలో మూడు భాషా ప్రాంతాలకు మూడు ప్రాంతీయ కార్యాలయాలు ఏర్పాటయ్యాయి. తెలుగు భాషను మాట్లాడే తెలంగాణా ప్రాంతీయ కార్యాలయాన్ని విజయవాడలో శ్రీ టి. హయగ్రీవాచారి, శ్రీ వి. బి. రాజు, శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ గారల ఆధ్వర్యంలో నిర్వహించారు.*



## శ్రీ వి. బాలకృష్ణ

శ్రీ వి. బాలకృష్ణగారు మహబూబ్ నగర్ (పాలమూర్) జిల్లా, కొల్లాపురం తాలూకా పెంట్లవల్లి గ్రామంలో శ్రీ వి. లక్ష్మయ్య - తులశమ్మ దంపతులకు జన్మించారు. ఇపుడు వీరి వయస్సు 80 సంవత్సరాలు.

వీరు 1934-42 సంవత్సరాల మధ్య కాలంలో హైదరాబాదులోని సిటీ కాలేజీలో విద్యను అభ్యసించారు.

ఆ రోజుల్లోనే జాతిపిత మహాత్మా గాంధీజీ కార్యక్రమాలపట్ల అనుభూతిని పొంది కాంగ్రెసు కార్యకర్తగా 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అజ్ఞాత కార్యకర్తగా పనిచేశారు. ఆ తదుపరి 1943లో మొదటి తరగతి వకీలు కోర్సు ప్యాసై 1944 నుంచి అడ్వకేటుగా కొల్లాపురం తాలూకా కోర్టులోను, మహబూబ్‌నగర్ జిల్లా కోర్టులోను ప్రాక్టీసు చేయడం ప్రారంభించారు.

అడ్వకేటుగా ప్రాక్టీసు చేస్తూనే స్వగ్రామంలో శ్రీ బాలకృష్ణగారు తన సహచరులు శ్రీ బి.శేషగిరిరావు, శ్రీ కె. వాసుదేవయ్య తదితరులతో కలిసి గ్రంథాలయోద్యమాన్ని, అక్షరాస్యతా కార్యక్రమాన్ని అస్పృశ్యతా నివారణోద్యమాన్ని ప్రారంభించడంతో పాటు నిరంకుశ నిజాం పాలనకు వ్యతిరేకంగా ప్రచార కార్యక్రమాన్ని ఉధృతం చేశారు.

ఇంతలో 1947 ఆగస్టు 15న భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని హైదరాబాదు సంస్థాన ప్రజలకు స్వాతంత్రం లభించలేదు. స్వగ్రామంలో శ్రీ బాలకృష్ణ



## శ్రీమతి వి. పార్వతమ్మ

తన సహచరులు శ్రీ శేషగిరి రావు, వాసుదేవయ్య తదితరుతో కొల్లాపూర్ పోలీసు స్టేషన్ పైనను, స్వగ్రామంలోను జాతీయ జండాను ప్రతిష్ఠించారు.

ఇటు స్టేటు కాంగ్రెసు, అటు కమ్యూనిస్టు పార్టీ సంస్థాన ప్రజల విముక్తిపై నిజాంకు వ్యతిరేకంగా పోరాటాన్ని ఉధృతం చేశాయి. సహాయ నిరాకరణోద్యమాన్ని నిర్వహించమని ప్రజలకు ఆ పార్టీలు ఉద్బోధించాయి. ఆ పార్టీల పిలుపు మేరకు శ్రీ బాలకృష్ణ గారు స్టేటు కాంగ్రెసు పక్షాన సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా ప్రభుత్వ లెవీ ధాన్యము ఇవ్వవద్దని, పన్నులు చెల్లించడం మానమని, ప్రజలు మద్యాన్ని సేవించ వద్దని ప్రబోధిస్తూ - చివరకు స్టేట్ కాంగ్రెసు నేత శ్రీ పాగా పుల్లారెడ్డి గారు కర్నూల్‌లో స్థాపించిన సరిహద్దుపోరాట కేంద్రంలో సరిహద్దు పోరాట యోధునిగా నమోదై ఆ కేంద్రం ద్వారా 1948 సెప్టెంబర్ 17న భారత సైనిక చర్యవల్ల హైదరాబాదు సంస్థానం విముక్తం పొంది ఇండియన్ యూనియన్‌లో విలీనం అయ్యేంత వరకు నిజాంసర్కారుకు ముస్లీం మతోన్మాదులైన రజాకార్లకు వ్యతి రేకంగా పని చేశారు. ప్రస్తుతం వీరు తమ స్వగ్రామమైన పెంట్లవల్లి గ్రామంలోనే సతీమణి పార్వతమ్మ గారితో ప్రశాంత జీవనం గడుపుతూ అప్పుడప్పుడు ఇంకను కోర్టుకార్యక్రమాలకు హాజరౌ తున్నారు. ●





## శ్రీ చిలుక మల్లయ్య

## శ్రీమతి బాలమ్మ

శ్రీ చిలుక మల్లయ్య గారు ఇందూరు (నిజామాబాద్) నగరవాసి. వీరు తమ జీవితంలో ఎన్నో నిమ్నోన్నతములను చవిచూసారు. ఆదర్శ పురుషులు. సమాజ సేవా తత్పరులు. వైదిక జీవనావలంబకులు. ఆర్య సమాజం ద్వారా నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొని హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్ లో విలీనం కావడానికి కృషి చేసారు. వీరి తండ్రి ముత్తయ్య. వీరికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్య సంతానవతి కానందున ఆమె ఆమోదంతో శ్రీ ముత్తయ్య శ్రీమతి గంగమ్మను రెండవ వివాహము చేసుకున్నారు. గంగమ్మ ముత్తయ్య దంపతుల ముద్దుల కుమారుడే చిలుక మల్లయ్య. వీరిది పద్మశాలి వంశం. పట్టంచు కుప్పెనపు మగ్గాలు నడిపించడంలో అందెవేసిన చెయ్యి మల్లయ్య తండ్రి ముత్తయ్యది.

మల్లయ్యకు 10 సంవత్సరములు వచ్చేసరికి తండ్రి ముత్తయ్య మరణించాడు. తల్లులిద్దరు (గంగమ్మ, లింగమ్మ) బ్రతుకు తెరువు కోసం మల్లయ్యతో సహా బొంబాయి నగరానికి వెళ్ళి అక్కడ రాత్రింబవళ్ళు బీడీ కార్ఖాణంలో కష్టించిపనిచేసి నిజామాబాద్‌కు తిరిగి వచ్చారు. బొంబాయి నుండి నిజామాబాద్ తిరిగి వచ్చేసరికి మల్లయ్య వయస్సు 12 సంవత్సరములు. స్వగ్రామంలో 14 సంవత్సరములు వచ్చేసరికి మూడవ తరగతి చదువుకున్నాడు. ఆకాలంలో బాల్య వివాహాలు ప్రాధాన్యతలో వున్నందున మల్లయ్యకు 14 సంవత్సరముల వయస్సులో బాలమ్మ అనే బాలికతో వివాహం జరిపించారు.

కుటుంబ పోషణ నిమిత్తం నాలుగు రూపాయల జీతంలో ఒక మహమ్మదీయుని బట్టల దుకాణంలో ఉద్యోగానికి దిగారు. ఆ రోజుల్లో ఇందూర్‌నగరంలో డి.వి.స్వామి ఆర్య సమాజప్రచారం ముమ్మరంగా చేస్తుండేవారు. వారి వల్ల మల్లయ్యగారిపై ఆర్యసమాజ ప్రభావం బాగా పడింది. ఆ ప్రభావంతో చేనేత పారిశ్రామికులైన పద్మశాలులకు వెట్టి చాకిరి నుండి విముక్తి

కలిగించడానికి శ్రీ గుంటక నర్సయ్య పంతులుతో, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ గార్లతో కలిసి పనిచేసారు. అప్పట్లో మల్లయ్యగారు నిజామాబాద్ ఆర్య సమాజానికి, ఆర్యసమాజ వ్యాయామశాలకు కూడా కార్యదర్శిగా వుండేవారు. ఆర్యసమాజం అంటే రజాకార్లకు గిట్టదు. అందువల్ల రజాకార్లు మల్లయ్య పై ఆగ్రహోదగ్రులై ఆయన ఇంట్లో మారణాయుధాలున్నాయని అంతటా ప్రచారంచేసి పోలీసుకు రిపోర్టు చేసారు. దానితో పోలీసులు ఆర్యసమాజ కార్యాలయంపై మల్లయ్య ఇంటిపై దాడిచేసారు. ఈ విషయాన్ని ముందుగానే పసిగట్టి గంగారాం ఆర్యా ఆర్య సమాజంలోని ఆయుధాలు భూమిలో పాతిపెట్టించారు. ఆయుధాలు ఏమీ దొరకనందున కార్యాలయంలో రిజిస్టర్‌లను ఇతర కాగితాలను స్వాధీనం చేసుకుని మల్లయ్యపై కేసు రిజిస్టర్ చేసి అరెస్టు వారెంటు జారీచేశారు. అదే సమయంలో హైదరాబాదు సంస్థానమందతటా అరెస్టులు ముమ్మరమయ్యాయి. ఆ పరిస్థితుల్లో మిత్రుల సలహామేరకు సయ్యద్ అనే రజాకార్ సవతి తల్లి సలహామేరకు మల్లయ్య అజ్ఞాతంలోకి వెళ్లారు. అజ్ఞాతంలో బొంబాయి కెళ్ళిన మల్లయ్య అక్కడ కామాటిపురలోని ఆర్యసమాజం వారి సహకారంతో నిజాం సంస్థాన శరణార్థుల సమితిని ఏర్పాటు చేసి శరణార్థులకు భోజనం వసతి వస్త్ర సదుపాయాలను సమకూర్చారు.

బొంబాయిలోని శరణార్థులకు హైదరాబాద్ సంస్థానం నుండి ఏరకమైన వార్తలు అందని కారణంగా కొండా లక్ష్మణ్ బాపూజీ గుంటక నర్సయ్య పంతులు శరణార్థులతో వెనుకకు తిరిగి వెళ్ళటానికి నిశ్చయించారు. ఆ మేరకు హైదరాబాద్ తిరుగు ప్రయాణం చేస్తుండగా బాసర వచ్చెసరికి మహాత్మాగాంధీని హత్య చేసారన్న వార్త వారికి అందటంతో అందరు ఖిన్నులయ్యారు. అదేసమయానికి ఉమ్రిలోని హైదరాబాద్‌స్టేట్ బ్యాంక్ దోపిడి చేయబడిందని తెలిసింది. పరిస్థితులు హైదరాబాద్‌లో అల్లకల్లోలంగా తయారయ్యాయి. సాయుధ, సరిహద్దు పోరాటాలు ప్రారంభమయ్యాయి. ఈ పోరాటాలలో మల్లయ్య గారు సహచరులు శ్రీ వడ్ల నరసింహులు, కిష్టయ్య, శ్రీ కైరంకొండ నారాయణ ముమ్మరంగా పాల్గొన్నారు. ఇంతలో సెప్టెంబరు 13రానే వచ్చింది. పోరాటాల ప్రాధాన్యతను గుర్తెరింగిన భారత ప్రభుత్వం హైదరాబాద్ సంస్థానంపై పోలీసు చర్య జరిపించటంతో ఇండియన్ యూనియన్‌లో విలీనమైంది. అప్పటి నుండి మల్లయ్యగారు చేనేత పారిశ్రామికుల అభ్యుదయం కోసం హైదరాబాద్ రాష్ట్ర చేనేత సహకార సంస్థలో వివిధ హోదాలలో పనిచేసి విశ్రాంతి పొందుతూ భారత ప్రభుత్వం ప్రతి నెల స్వతంత్ర్య సేనానులకిచ్చె సన్మాన పెన్షన్‌తో తన శేష జీవితాన్ని గడుపుతున్నారు. ●




అప్పటి నైజాం రాజ్యం (నేటి ఆంధ్ర ప్రదేశ్)లో జిల్లా హైదరాబాద్ తాలూకా షాబాద్, కొత్తపేట గ్రామంలో 1921 మే నెలలో ఒక సామాన్య కుటుంబంలో జన్మించి వీధి పాఠశాలలో తెలుగు, ఉర్దు, ఫార్శి భాషలు నేర్చుకొనిరి.

వీరు 18వ యేట నుండి ఆర్యసమాజం, జీవరక్షా సమితి, వైదిక సేవా సంఘం కార్యక్రమాలలో పాల్గొని, మహాత్ముని ఆదేశానుసారముగా మద్యపాన నిషేధము కొరకు కల్లు, సారా దుకాణముల ముందు పికెటింగ్ జరుపుచు, వితంతు వివాహం జరుపుటలో చేయూతనిచ్చుచూ రాజకీయ కార్యక్రమాలలో పాల్గొంటూ ఆనాటి నైజాం పాలనలో కాంగ్రెస్, ఆర్య సమాజాల పై నిషేధము ఉన్నాలెక్క చేయక నిజాం యొక్క నిరంకుశ పాలనను వ్యతిరేకించుచు వైదిక సేవా సంఘం పేర సమావేశాలు జరుపుతున్న సమయంలో నైజాం ప్రభుత్వం రజకార్లు శ్రీ మల్లయ్యగుప్త ఆస్తులను నష్టము చేయటమే కాక వారిని చాలా బాధలు పెట్టారు. ఆయన అన్నింటిని ఓర్చుకుని ధ్యేయాన్ని విడువక అప్పటి ఇండస్ట్రీయల్ ఏరియా అయిన గొల్కొండ చౌరస్తా దగ్గర 1947 అక్టోబరు 4న సత్యాగ్రహం చేసి ఒకసంవత్సరముపాటు కఠిన జైలు శిక్షను అనుభవించి 1948 సెప్టెంబరు 24న జైలు నుండి విముక్తి పొందడం జరిగింది.

వీరు కేంద్ర ప్రభుత్వము నుండి తామ్ర పత్రాన్ని పొంది పెన్షన్ పొందుచున్నారు. 1988 ఏప్రిల్ 23 తేదీన అండమాన్ నికోబార్ ద్వీపములకు వెళ్లివచ్చినారు. వీరి వయస్సు 78 సంవత్సరములు. ●

హైదరాబాదులో కమ్యూనిస్టు పార్టీ అవతరణ

- *హైదరాబాదు సంస్థానంలో 1939లో కమ్యూనిస్టు పార్టీ అవతరించింది.*





## ప్రొఫెసర్ శ్రీ మిట్టా యాదవరెడ్డి

## శ్రీమతి మిట్టా అనూరాధ

ప్రొఫెసర్ శ్రీ మిట్టా యాదవరెడ్డిగారు నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా వెలిశాల గ్రామంలో శ్రీ మిట్టా రామచంద్రా రెడ్డి- చిలకమ్మ దంపతులకు 1930 జూన్ 17న జన్మించారు. జన్మస్థానమైన వెలిశాల గ్రామంలోనే మూడవ తరగతి వరకు ఒక ప్రయివేటు టీచర్ వద్ద చదువుకున్నారు. 1940-44 సంవత్సరాల మధ్యకాలంలో సూర్యాపేటలోని ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలో 4 నుండి 7వ తరగతి వరకు చదువుకొన్నారు. అటు పిమ్మట 1944 నుండి 1947 వరకు హనుమకొండ (వరంగల్) ప్రభుత్వ పాఠశాలలో 10వ తరగతివరకు చదువుకున్నారు. 1947 జూన్‌లో హనుమ కొండలోని ఉస్మానియా ఇంటర్మీడియేట్ ఇంటర్ మొదటి సంవత్సరంలో ప్రవేశించారు. సంస్థాన విముక్తి పోరాటంలో పాల్గొనటంవల్ల సెప్టెంబర్ ఒకటిన శ్రీ యాదవ్ రెడ్డిగారిని మొదటిసారిగా నిజాం పోలీసులు అరెస్టు చేశారు.

శ్రీ యాదవ రెడ్డిగారు సూర్యాపేటలో 7వ తరగతి చదువుతున్న రోజుల్లోనే (1938) కమ్యూనిష్టు నాయకుడు ధర్మభిక్షం గారి ప్రోత్సాహంతో రాజకీయ రంగప్రవేశం చేశారు పృథ్వీసింగ్ అజాద్, భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్, చంద్రశేఖర్ ఆజాద్‌ల జీవిత చరిత్రలు చదవటంతో శ్రీ యాదవరెడ్డిగారు ఉత్తేజితులై బ్రిటిష్ సామ్రాజ్యవాద బానిసత్వము నుండి విముక్తికై భారత ప్రజలు జరుపుతున్న స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనవలెనన్న ఆకాంక్ష శ్రీ యాదవరెడ్డిగారి లో కలిగింది. జాతీయపతాక దినోత్సవాన్ని జరపాలని స్టేట్ కాంగ్రెసు, కమ్యూనిష్టు పార్టీ, ఆంధ్రమహా సభలు పిలుపునిచ్చాయి. ఆ పిలుపునందుకున్న శ్రీ యాదవరెడ్డిగారు 2-9-1947న స్థానిక గ్రంథాలయం పక్కగా వున్న కొండపై జాతీయ జెండాను ప్రతిష్ఠించి బహిరంగసభ నిర్వహించుటకు ప్రజలు అధికసంఖ్యలో పాల్గొనాలని 1-9-1947 న వాల్‌పోస్టర్లు అంటించుచుండగా గస్తీ పోలీసులు శ్రీ యాదవరెడ్డిని మరో ముగ్గురు విద్యార్థులను అరెస్టు చేసి అదుపులోకి తీసుకొని వరంగల్ సెంట్రల్ జైలులో నిర్బంధించారు.

గెరిల్లా పోరాటంలో కమ్యూనిస్టు పార్టీ వైపు నుండి కార్యకర్తలకు శిక్షణ ఇచ్చుటకు ఆంధ్రప్రాంతంలో రెండు సరిహద్దు పోరాట శిక్షణ కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. అందులో ఒక దానిలో శ్రీయాదవరెడ్డిగారు శిక్షణ పొందారు. ఆ పిదప వరంగల్ జిల్లాలో

గెరిల్లా పోరాట దళాల నిర్మాణము కొరకు శ్రీ యాదవ్ రెడ్డిగారు వరంగల్‌కు పంపబడ్డారు.

1948 జనవరి 25 వరంగల్ డి.ఐ.జి. తాడికొండ గ్రామంపై పోలీసులతో దాడి జరిపినప్పుడు ఆగ్రామం గుట్టపై నుండి యాదవరెడ్డిదళం పోలీసులపై యెదురు దాడిజరిపిన వీరోచితచర్య చరిత్ర పుటల కెక్కడం శ్రీ యాదవరెడ్డి నిజాం వ్యతిరేక పోరాటంలోని స్వర్ణఘట్టంగా చెప్పుకోవచ్చు.

1948 సెప్టెంబర్‌లో నిజాం సంస్థానంపై భారత సైన్యాలు పోలీసు చర్య జరిపి 1948సెప్టెంబరు 17న హైదరాబాదు సంస్థానమును ఇండియన్ యూనియన్‌లో విలీనం చేశాయి.

హైదరాబాదులో మిలటరీ ప్రభుత్వం ఏర్పడ్డాక కూడా శ్రీ యాదవరెడ్డిని విడుదల చేయలేదు. 1949లో కోర్టు విచారణలో కేసులన్నీ కొట్టివేయబడ్డాయి. అయినా రాష్ట్రప్రభుత్వం 1951 డిశంబర్ 31 వరకు ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం క్రింద జైల్లో నిర్బంధించింది. అప్పటికి కొత్త భారత రాజ్యాంగం అమలులోకి వచ్చింది. 1951 డిశంబర్ 30నాడు శ్రీ యాదవరెడ్డిగారు జైలు నుండి విడుదల చేయబడ్డారు.

అటు పిమ్మట తిరిగి చదువును కొనసాగించాలన్న ప్రగాఢమైన వాంఛతో 1954 మార్చిలో ప్రయివేట్‌గా అజ్మీర్ ఇంటర్ ప్యాసయి నిజాం కాలేజీ నుండి 1956లో బి.ఎ. పట్టాను పొంది 1958 లో ఎమ్.ఎ (ఎకనామిక్స్)లో ఉస్మానియా యూనివర్సిటీ నుండి మొదటి ర్యాంకులో ప్యాసయి 1954 నుండి 1963 వరకు ఢిల్లీస్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ మరియు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనమిక్స్ గ్రోత్ లో ఫోర్డ్‌ఫౌన్‌డేషన్ ఫెలోషిప్ అవార్డ్ పొంది పి.హెచ్‌డి చేశారు. 1966 ఆగష్టు నుండి 1977 వరకు ఉస్మానియా యూనివర్సిటి కాలేజీలో లెక్చరర్‌గాను రీడర్‌గాను పనిచేసి అటు పిమ్మట 1977 నుండి 1985 వరకు ఎకనామిక్స్ డిపార్టుమెంటు హెడ్‌గాను, 1985 నుండి 88 వరకు యూనివర్సిటి ఆర్ట్స్ కాలేజి ప్రిన్సిపాల్‌గాను 1988 నుండి 1990 వరకు ప్యాకల్టీ సోషల్ సైన్స్ రీడర్ గాను పదోన్నతులను పొంది 1990 జూన్ 30న పదవీ విరమణ చేశారు. 1977 నుండి 87 వరకు యూనివర్సిటీ సెంటర్ ఫర్ ప్లానింగ్ అండ్ డెవలప్‌మెంట్ స్టడీస్ డైరెక్టర్‌గాను 1987 నుండి 1990 వరకు సెంటర్ ఫర్ ఏరియా స్టడీస్ డైరెక్టర్‌గాను 1986 నుండి 1991 వరకు యూనివర్సిటీ ఎగ్జిక్యూటివ్ సివిల్ మెంబర్ గాను పదవీ బాధ్యతలను నిర్వర్తించారు. ప్రస్తుతం సఫిల్ గూడాలో ప్రశాంత జీవనంభార్య శ్రీమతి అనూరాధగా రితో కలసి జీవనం గడుపుతున్నారు.

## హైదరాబాద్‌స్టేట్ కాంగ్రేసు ఆవిర్భావం

***1938 అక్టోబర్ 24న గోవిందరావు నానల్ అధ్యక్షుడుగాను, రామకృష్ణ ధూత్ కార్యదర్శిగాను హైదరాబాద్‌లో స్టేట్ కాంగ్రేసు ఆవిర్భవించింది.***





## శ్రీ వెదిరె రమణారెడ్డి

## శ్రీమతి అహల్యా రెడ్డి

శ్రీ వెదిరె రమణారెడ్డిగారు ఇప్పటి రంగారెడ్డి జిల్లా మంచాల మండలంలోని "అరుట్ల" అనే జాగీరు గ్రామంలో 1930జూన్ 25న శ్రీ వెదిరె మాధవరెడ్డి- రత్నమ్మ దంపతులకు జన్మించారు. నిజాంపాలనా కాలంలో ఈ అరుట్ల గ్రామం శివన్నగూడెం పోలీసు స్టేషన్ పరిధిలో వుండేది. పుట్టిన గ్రామంలోనె నాలుగవ తరగతి వరకు శ్రీరెడ్డి ప్రాధమిక విద్యను అభ్యసించారు. ఆ పిదప మెదక్‌లో వారి బావ శ్రీ కె. వెంకట రెడ్డి వద్ద వుండి ఐదవతరగతి పూర్తిచేశారు. అటు పిమ్మట హైదరాబాదుకు వచ్చి మాధ్యమిక విద్యను పూర్తిచేసి హైస్కూలు విద్యలో పదవతరగతి లో వుండగా 1947 అగష్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆ సందర్భంగా నిజాం ప్రభువు మీర్ ఉస్మాన్ అలిఖాన్ మాత్రం తన సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేయనని రజాకార్ల సహకారంతో 'ఆజాద్ హైదరబాద్'ను ప్రకటించుకున్నాడు.

సంస్థానానికి చుట్టు ప్రక్కల వున్న భారత ప్రజలు స్వాతంత్రవాయువులు పీల్చుతూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవిస్తుంటే హైదరాబాదు సంస్థాన ప్రజలు మాత్రం నిజాం నిరంకుశత్వానికి రజాకార్ల కిరాతక మతతత్వానికి బలికావలసి వచ్చింది. ఆదశలో హైదరాబాదు సంస్థానమందంతటను నిజాం వ్యతిరేక వుద్యమాలు చెలరేగాయి. ఒకవైపున స్టేటు కాంగ్రెసు, మరొకవైపున కమ్యూనిస్టు పార్టీలు నిజాంకు వ్యతిరేకంగా పోరాటాన్ని ఉధృత పరచడంతో పాటు విద్యార్థులను పాఠశాలలను, కాలేజీలను బహిష్కరించమని కోరాయి.

ఆ దశలో శ్రీ రమణారెడ్డిగారు స్టేట్ కాంగ్రెసు నాయకత్వాన కాంగ్రెసు కార్యకర్తగా నిజాం వ్యతిరేక పోరాటోద్యమంలో కాలు మోపారు. తోటి విద్యార్థులతో కలిసి రెండు దఫాలు సుల్తాన్ బజారు సెంటర్‌లో సత్యాగ్రహంచేసి లాఠీచార్జీలకు గురికావడంతోపాటు నిర్బంధంలోకి తీసుకోబడి అర్ధరాత్రివేళ హైదరాబాదు నగరం వెలుపల వదలి వేయబడ్డారు. తదుపరి అరుట్ల గ్రామం చేరి తన సహచరులైన శ్రీ వి. నరహరిరావు, వి. లక్ష్మారెడ్డి, వి. కిషన్ రావు వి. శేఖర్‌రెడ్డి గార్లతో కలిసి నిజాం పాలనకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని ఉధృతం చేయడం తోపాటు, అస్పృశ్యతానివారణ మొదలుగాగల కార్యక్రమాల్లో వారు పాల్గొని పనిచేశారు. తదుపరి హైదరాబాదు కు వెళ్లి వారి బావగారు కుంభం రామిరెడ్డిగారి ఇంటి వద్దనుండి ఉద్యమాన్ని ఉధృతం చేయాలని ప్రయత్నిస్తున్న సమయంలో శివన్నగూడెం

పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టర్ మొహమ్మద్ ఇమాం శ్రీ రమణారెడ్డిని అరెస్టు చేయుటకు రాగా రమణారెడ్డి గారు తన సోదరి సహకారంతో పెరటివాకిట నుండి బయటపడి విజయ వాడలో స్టేట్ కాంగ్రేసుపక్షాన కాంగ్రెసు నాయకుడు తిరువరంగం హయగ్రీవా చారిగారుసంస్థాపించబడిన సరిహద్దు పోరాట కేంద్రంలో సరిహద్దు పోరాట యోధునిగా నమోదు చేయించుకొని సమీపంలోని పరిటాలకు సాయుధ శిక్షణ పొందుటకై పంపబడిరి. ఈ పరిటాల గ్రామం కమ ల్యార్‌జంగ్ జాగీరుగా ఏడు గ్రామాలతో వుండేది. భారతదేశానికి స్వాతంత్రంరాగానే ఈ జాగీరు స్వతంత్ర్య రాజ్యంగా ప్రకటించు కొంది. అక్కడ ఆజాద్ హింద్‌ఫౌజ్ కెప్టన్ శ్రీ యన్. రామచంద్రన్‌గారి పర్యవేక్షణలో శిక్షణ పొంది అటు పిమ్మట నల్లగొండ జిల్లా మిర్యాలగూడా తాలుకా సమీపంలో కృష్ణానదికి అవలగానున్న గుంటూరు జిల్లాలోని జమ్మలమడక, పోరాట కేంద్రాలకు సరిహద్దు యోధులకు శిక్షణ ఇచ్చుటకై పంపబడ్డారు.

అక్కడ కార్యకర్తలకు శిక్షణ ఇస్తూనే వావిళ్ళపల్లి,కొంపెల్ల, దాములపల్లి, చండూరు గ్రామాలలో నిజాం పోలీసులు, రజాకారులు జరిపే అత్యాచారాలను శ్రీ రమణారెడ్డి గారు తన బృందాలతో ఎదురొడ్డి నిలిచి పోరాడారు. ఈ పోరాటంలో రమణా రెడ్డిగారి బృందంలోని ముగ్గురు సరిహద్దు యోధులు మరణించగా రజాకార్లు నలుగురు మరణించారు.

ఆ తరువాత పోరాట యోధుల యూనిఫారం నిమిత్తం హైదరాబాదు వచ్చి యూనిఫారం ఖరీదుచేసి వెనక్కు తిరిగి వెళ్లె ప్రయత్నంలో బస్సులో వుండగా ఇద్దరు సాయుధ పోలీసులు వచ్చి ఏమిటి మూటలో వున్నవి అని ప్రశ్నిస్తూ ఆయన ఛాతిపై తుపాకిని పెట్టగా సమయ స్ఫూర్తితో స్కాట్ బట్టలు అని చెప్పగా పోలీసులు రమణారెడ్డిగారిని విడిచివెళ్లారు. ఇంతలో రెండు మూడురోజుల్లోనే భారతసైన్యాలు హైదరాబాదునుస్వాధీన పరుచుకున్నాయి. తరువాత రెడ్డిగారు స్వేచ్ఛగా బయటకు వచ్చి హెచ్.ఎస్.సి. పరీక్షను సప్లమెంటరీలో పూర్తిచేసి, ఆ పిదప సిటీకాలేజీ నుండి ఇంటర్‌మీడియట్ విద్యను పూర్తిచేశారు. ఆ వెనువెంటనే పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి ఎన్నికయ్యారు. విధినిర్వ హణలో ఎన్ని ఒడుదుడుకులను ఎదు ర్కొన్నా చెక్కు చెదరని ధైర్యంతో విద్యుక్త ధర్మాన్ని నిర్వహించి డిప్యూటి సూపరెం డెంటు హోదాలో ఆసిఫ్‌నగర్ పోలీసు అసిస్టెంటు కమీషనర్‌గా పదవీ బాధ్యతలు నిర్వహించారు.

జాతీయ, అంతర్జాతీయ ప్రచారం పొందిన శ్రీమతి రంజాబీ కేసులో పోలీసు అధికారిగా అత్యంత చాకచక్యంతో సమస్య ను పరిష్కరించి అందరి మన్ననలకు పాత్రు లైయ్యారు. విధినిర్వహణలో శ్రీ రెడ్డి గారు వ్యవహరించిన తీరుకు ప్రభుత్వం స్పందించి 105 గుడ్ సర్వీను ఎంట్రీనును, 3 మెరిటోరియస్ ఎంట్రీసును, 18 క్యాష్ అవార్డులను ప్రదానం చేయడంతోపాటు అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ఇండియన్ పోలిస్ మెడల్‌ను ప్రదానం చేసింది. 1988 జూన్‌లో శ్రీ రెడ్డి గారు పదవీ విరమణ చేశారు. వీరి సతీమణి శ్రీమతి అహల్యా రెడ్డిగారితో జూబ్లీ హిల్స్‌లోని 'గ్రాండ్ వ్యూ' అని పిలువబడే స్వగృహంలో ప్రశాంత జీవనాన్ని గడుపు తున్నారు. ●





**శ్రీ మేడ రామచంద్రారెడ్డి** **శ్రీమతి నిర్మలా రామచంద్రారెడ్డి**

శ్రీ మేడరామచంద్రారెడ్డిగారు 1928 జూన్ 14వ తేదీన నల్లగొండ జిల్లాలోని సర్వారము గ్రామం శివారు గ్రామమైన బుసిరెడ్డిగూడెంలో మాతామహుల ఇంట జన్మించారు. రామచంద్రారెడ్డి తండ్రి నరసింహారెడ్డిగారు. తల్లి పుల్లమ్మగారు. రామచంద్రారెడ్డి గారి స్వగ్రామం మిర్యాల గూడెం తాలూకాలోని గుంటుపల్లి గ్రామం. వీరి అన్న నారాయణ రెడ్డి తమ్ముళ్లు ప్రతాప రెడ్డి, జనార్ధన్‌రెడ్డి. చెల్లెండ్రు లక్షమ్మ, అనసూరియమ్మ, సుభద్రమ్మ, రామనర్సమ్మ అనువారు. శ్రీ రామచంద్రారెడ్డిగారితో కలసి మొత్తం నరసింహా రెడ్డి, పుల్లమ్మ దంపతులకు 8 మంది సంతానం.

రామచంద్రారెడ్డి ప్రాథమిక విద్యలో భాగంగా రెండో తరగతి స్వగ్రామం గుంటి పల్లిలోను, అటుపిమ్మట గుంటుపల్లికి ప్రక్క గ్రామమైన యెర్రబల్లిలో మూడవ తరగతి వరకు, నాలుగవ తరగతి తిప్పర్తిలోను చదువుకున్నారు మాధ్యమిక విద్యకై తాలూకా కేంద్రమైన మిర్యాలగూడెం వెళ్లలేక ఒక సంవత్సరం పాటు పటేల్, పట్వారీల దగ్గర వ్రాతపని నేర్చుకొనే నిమిత్తము ఊరిలోనే వుండిపోయారు.

శ్రీ రామచంద్రారెడ్డిగారు మిర్యాల గూడెంలో చదువుతున్నరోజులలోనే ఆర్యసమాజము వారి కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపుతుండేవారు. అప్పట్లో ఆర్య సమాజం వారు తమ అధ్యాత్మిక కార్య క్రమాలతోపాటు నిజాం ముష్కరపరిపాల నకు వ్యతిరేకంగాను, ముస్లిం మతో న్మాదులైన రజాకార్లు చేస్తుండే అత్యాచారా లను, ఆగడాలను నిరోధించడంలో హైదరాబాదు సంస్థానమందంతటను బహుముఖంగా ఉద్యమాలను నిర్వ హిస్తుండేవారు. మిర్యాల గూడెంలో వున్నపుడు ఆ కార్యక్రమాల్లో శ్రీ రామచంద్రా రెడ్డి ముమ్మరంగా పాల్గొనెవారు.

నల్లగొండ వెళ్ళి హైస్కూల్ విద్యను అభ్యసిస్తున్న సమయంలో 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించ బడింది. విద్యార్థులు పాఠశాలలను బహిష్కరించి నిజాంకు వ్యతిరేకంగా ప్రజోద్యమాలను నిర్వహిం చండని స్టేట్ కాంగ్రెస్‌వారిచ్చినపిలుపుతో శ్రీరామచంద్రా రెడ్డిగారు పాఠశాల విద్యకు స్వస్తిచెప్పి

ఉద్యమంలో ప్రవేశించారు ఆయనపై అరెస్టు వారెంటు జారీ చేయబడింది. నిజాం పోలీసులు రామచంద్రరెడ్డిగారి తల్లి దండ్రులను కుమారుని చూపమని ఒత్తిడిచేస్తూ హింసించ సాగారు. దానిని భరించలేక వారు కృష్ణానదికి ఆవలవున్న పల్నాడుకు వలస వెళ్ళారు.

నిజాం సంస్థానం వెలువల స్వతంత్రభారతంలో చుట్టూ సరిహద్దు పోరాట యోధుల కేంద్రాలు కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీలు ఏర్పాటు చేశాయి. కార్యకర్తలకు ఈ కేంద్రాలలో సాయుధ శిక్షణ కూడా ఇవ్వబడేది. అక్కడ శిక్షణ పొందేవారికి గట్టి నియమ నిబంధనలు వుండేవి. వాటిని అంగీకరించి శ్రీరామచంద్రా రెడ్డిగారు రక్తంతో సంతకం చేసి 1947 సెప్టెంబర్‌లో అప్పట్లో కృష్ణాజిల్లాకు చెందిన మునగాల పరగాణాలో రేపాలగ్రామంలో శ్రీ కోదాటి నారాయణ రావుగారి ఆధ్వర్య ములో నిర్వహింపబడుతున్న కేంద్రానికి వెళ్లారు. తదుపరి నందిగామ తాలూకాలోని జయంతి క్యాంపుకు పంపబడ్డారు. ఇది హైదరాబాద్ సంస్థానానికి చెందిన ఎర్రుపాలెం రైల్వే స్టేషన్‌కు మూడు కిలోమీటర్ల దూరంలో వుంటుంది. అక్కడ మూడువారాలున్నవిదవ మొత్తం వాలంటీర్లందరిని కృష్ణాజిల్లా నందిగామ తాలూకాకు ఆవలగా, విజయవాడకు సమీపంలో వున్న "పరిటాల' జాగీరు' గ్రామానికి పంపబడ్డారు.ఈ పరిటాల గ్రామం కమాల్ యార్‌జంగ్ బహద్దూర్‌కు చెందిన జాగీర్ గ్రామం నిజాం సంస్థానంలో అంతర్భాగం, దాని చుట్టూన 1947 ఆగస్టు 15న స్వాతంత్ర్యం పొందిన భారతదేశ అంతర్భాగమైన కృష్ణాజిల్లా వున్నందున పరిటాల ప్రజలు కమాల్‌యార్ జంగ్ జాగీరు బలగాలను తరిమిగొట్టి తమ ఏడు గ్రామాలకు స్వయం స్వతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. నిజాం వత్తాసుతో కమాల్‌యార్ జంగ్ పోలీసు బలగాలను తెప్పించి జాగీరును తిరిగి స్వాధీనపరుచుకొనే ప్రయత్నంలో ప్రజలను నానా భీభత్సం చేయసాగాడు జాగీర్ కమాల్‌యార్ జంగ్. అయితే అప్పటికే చేరుకున్న పోరాట యోధులు దళం బలపడిస్థిరపడింది. అందువల్ల ఆ జాగీరు దారుమళ్లీ జాగీరును స్వాధీన వరుచుకొనే సాహసం చేయకపోయాడు.

పరిటాలలో ఆజాద్ హింద్‌ఫౌజ్ నాయకుడు శ్రీ రామచంద్రన్ నాయకత్వంలో మిలటరీ శిక్షణ పూర్తిచేసుకున్నాక నిజాం పోలీసులు, రజాకార్లు చేస్తున్న దోపిడీలు, గృహదహనాలు, మానభంగాలను ఆపుచేసే కార్యక్రమంలో భాగంగా వేరే కేంద్రాలలో కార్యకర్తలకు మిలిటరీ శిక్షణ ఇచ్చుటకు శ్రీ రామచంద్రారెడ్డిగారు పంపబడ్డారు.

ఆ విధంగా గుంటూరు జిల్లాలోని మాచర్లకు సమీపంలోగల తాళ్లపల్లి క్యాంపుకు శ్రీరామచంద్రారెడ్డి గారుమిలటరి కమాండర్‌గా చేరి వాలంటర్లకు శిక్షణ యిచ్చారు. ఒకనాటి రాత్రి శ్రీరామచంద్రారెడ్డి ఆయన సహచరులతో నిడిగల్ పోలీసు స్టేషన్‌పై దాడిచేసి అక్కడి ఆయుధాలను స్వాధీనం చేసుకోవాలనే ప్రయత్నంచేశారు. అది రాత్రి 9-10 గం॥ ల సమయము. పోలీసు స్టేషన్‌పై పోరాట యోధులు

దాడిచేస్తున్నారని సమాచారాన్ని అందుకున్న పోలీసులు సరిహద్దు పోరాట యోధులు స్టేషన్‌పై దాడి చేయకుండా వారి దృష్టిని మళ్ళించడానికి కొమ్ములు, డప్పులు వాయించసాగారు. అవేవో పెళ్లివాయిద్యాలు అని భావించి ఆదమరిచి ముందుకు సాగుతున్న యోధులపై నలువైపులనుంచి నిజాం పోలీసులు ముట్టడించి కాల్పులు జరపటం మొదలుపెట్టారు. పోరాట యోధులు కొందరు ఎదురు కాల్పులు జరిపి తప్పుకున్నారు. ఆ చీకటల్లో ఒక్క అడుగు పక్కకు వేసినా శ్రీ రామచంద్రారెడ్డి మిగతా పోరాట యోధులు కొందరు అక్కడ గల బావిలో పడి చనిపోయి వుండేవారే. అదృష్టవశాత్తు అట్లా జరుగలేదు. శ్రీరామ చంద్రారెడ్డిని మరికొందరు పోరాట యోధులను మారణ యుధాలు కలిగి యున్నారనే నేరాఆరోపణపై అరెస్టు చేశారు. మాచర్ల పోలీసులు

తదుపరి గుంటూరు కలెక్టర్, పోలీసు సూపరిండెంట్ ఉద్యమ ఆశయాలను గ్రహించి పోరాట యోధులందరిని విడుదలచేశారు. ఆయుధాలను మాత్రం పోలీసులు తమ వద్దనే వుంచుకున్నారు. చివరకు 1948 సెప్టెంబర్ 17న భారత సైనిక చర్యవలన హైదరాబాదు సంస్థానం నిజాం కబంధహస్తాలనుండి విముక్తంగా వింపబడి ఇండియన్ యూనియన్‌లో విలీనమయ్యాక శ్రీరామచంద్రారెడ్డిగారు స్వేచ్ఛగా బయటప్రపంచంలోకి తిరిగి వచ్చి మళ్లీ చదువు ప్రారంభించారు.

1950 జూన్‌లో నల్లగొండ ప్రభుత్వ ఉన్నత పాఠశాలనుండి హైయ్యర్ సెకండరీ విద్యను పూర్తి చేసి 1951 హైదరాబాదు లోని బహదూర్ ఖాన్ టెక్నికల్ కాలేజి నుండి సబ్ ఓవర్ సీర్ కోర్సును పూర్తి చేశారు. 1952లో ప్రభుత్వ గుమస్తా ఉద్యోగంలో ప్రవేశించారు. గుమాస్తా ఉద్యోగం చేనస్తానే ఉస్మానియా ఇంజనీరింగు కాలేజీ నుంచి ఓవర్‌సీర్ కోర్సును పూర్తి చేసినందున 1958లో గుమాస్తా ఉద్యోగం నుండి ఓవర్‌సీర్ ఉద్యోగానికి మారారు. ఓవర్‌సీర్ ఉద్యోగం చేస్తూనే ఎల్.సి.ఇ. పూర్తి చేసి పంచాయితీ రాజ్ శాఖలో సూపర్‌వైజర్‌గా నియమింపబడి అటుపిమ్మట డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ పదవి వరకు అంచెలంచెలుగా ఎదిగిన శ్రీ రామచంద్రారెడ్డిగారు 1986లో పదవి విరమణ చేశారు. ప్రస్థుతం ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల సంస్థకు ప్రధాన కార్యదర్శిగా వ్యవహరి స్తున్నారు. వీరు తామ్రపత్ర గ్రహీత.

శ్రీ రామచంద్రారెడ్డి గారి వివాహం 1953లో శ్రీమతి నిర్మలాదేవిగారితో జరిగింది, శ్రీమతి నిర్మలమ్మగారు పతి భక్తి, దైవభక్తి, త్యాగగుణము కలిగిన ఆధ్యాత్మిక పరురాలు. దానశీలి. శ్రీరామచంద్రారెడ్డి, నిర్మలా దేవిగార్లకు ఒక కూతురు, ఒక కుమారుడు వున్నారు. కూతురు జయశ్రీ ఎమ్.ఎ. పట్టభద్రురాలు. నిజామాబాద్ కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. కుమారుడు రాజశేఖర్ రెడ్డి ఇంజనీరింగ్ పట్టభద్రుడు. ప్రైవేటు సంస్థలో ప్రాజెక్టు ఇంజనీరుగా పనిచేస్తున్నాడు.

శ్రీ రామచంద్రారెడ్డిగారు ప్రస్థుతం బేగంపేట మెథడిస్టు కాలనీలో సతీమణి నిర్మలాదేవిగారితో ప్రశాంత జీవనం కొనసాగిస్తున్నారు. ●



## శ్రీ గడ్డం రామిరెడ్డి



## శ్రీమతి గడ్డం కౌసల్యాదేవి

శ్రీ గడ్డం రామిరెడ్డి గారు నల్లగొండ జిల్లా శాలిగౌరారం మండలం ( పూర్వం నల్లగొండ తాలూకా) మాలగడ్డ కొత్తపల్లి గ్రామంలో 1931 ఫిబ్రవరి 22న శ్రీ గడ్డం అనంతరెడ్డి నరసమ్మ దంపతులకు జన్మించారు. శ్రీరామిరెడ్డి గారికి 8 సంవత్స ములవయస్సులో తండ్రి కాలధర్మం చెందారు. అందువలన సూర్యాపేట తాలూకాలోని తిరుమలగిరి గ్రామంలో మేనమామ సంకెళ్లపల్లి రామకృష్ణారెడ్డిగారి ఇంటికి వెళ్లి అక్కడ ప్రాథమిక విద్యను పూర్తిచేశారు.

1944లో మాధ్యమిక, హైస్కూల్ విద్యను అభ్యసించుటకై వరంగల్ జిల్లా హనుమకొండకు వెళ్లి అక్కడ తన మాధ్యమిక విద్యను ప్రారంభించారు. 1947 ఆగస్టు 15 భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించ బడింది. కాని హైదరాబాదు సంస్థాన ప్రజలకు స్వాతంత్ర్యాన్ని నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ నిరాకరించారు. ఇండియన్ యూనియన్‌లో చేరుటకు ఇష్టపడలేదు. దానితో హైదరాబాదు సంస్థాన ప్రజలలో కోపాగ్ని జ్వాలలు చెలరేగాయి. నిజాం సర్కారుకు వ్యతిరేకంగా ఉద్యమాలు తీవ్రతరం అయ్యాయి. స్టేట్ కాంగ్రెసు, కమ్యూనిష్టు పార్టీలు- విద్యార్థులను పాఠశాలలు, కళాశాలలు బహిష్కరించి నిజాం వ్యతిరేక కార్యక్రమంలో పాల్గొని హైదరాబాదు సంస్థాన ప్రజల విముక్తికై కృషి చేయమని పిలుపునిచ్చాయి. ఆ పిలుపునందుకున్న శ్రీరామిరెడ్డిగారు వారి స్వగ్రామమైన మాలగడ్డ కొత్తపల్లికి చేరుకున్నారు. ఆ రోజుల్లో ఆ ప్రాంతంలో శ్రీ కట్టా రామచంద్రారెడ్డి నాయకత్వంలో కమ్యూనిస్టు పార్టీ ఉధృతంగా నిజాం వ్యతిరేకపోరాటంలో పనిచేస్తుండేది. వారి ప్రోత్సాహంతో కమ్యూనిస్టు పార్టీలో చేరి మాలగడ్డ కొత్తపల్లి గ్రామ కార్యదర్శిగా నిజాం సర్కారుకు, మతదురహంకారులైన రజాకార్లకు వ్యతిరేకంగా పనిచేయడం ప్రారంభించారు. ఆ సమయంలో ఈదులూరు గ్రామానికి చెందిన శ్రీ మద్ది

నారాయణరెడ్డిని, ఉప్పల వంచ గ్రామానికి చెందిన శ్రీ గార్లపాటి అనంతరెడ్డి గారల హత్యలు జరిగాయి. ఈ హత్యలు కమ్యూనిస్టుల వలన జరిగాయన్న భావనతో హత్యా రాజకీయాల పట్ల ఇష్టంలేని శ్రీ రామిరెడ్డిగారు అటుపిమ్మట మేనమామగారి స్వగ్రామమైన తిరుమలగిరి గ్రామాన్ని చేరుకొని అక్కడ నిజాం వ్యతిరేక పోరాటం సాగించారు రజాకార్లతో జాజిరెడ్డిగూడెం వద్ద జరిగిన పోరాటంలో శ్రీ పాటి చెన్నమల్లారెడ్డిగారితో పాటు శ్రీరామిరెడ్డిగారికి కూడా తుపాకి గుండుదెబ్బతొడకు తాకింది. అటుపిమ్మట ఫణిగిరిలోని మిషన్ ఆసుపత్రిలో చికిత్స పొంది ఆ తరువాత అప్పట్లో కృష్ణా జిల్లాలోని మునగాల పరగణాకు చెందిన రేపాల గ్రామంలోశ్రీకోదాటి నారాయణరావుగారి నాయకత్వంలో నిర్వహింప బడుతున్న సరిహద్దు పోరాట కేంద్రంలో చేరారు. ఆ తదుపరి శ్రీరెడ్డి పెదవెంకటరెడ్డి, చిన్నవెంకట రెడ్డిగార్ల ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న కొక్కిరేని సరిహద్దు పోరాట కేంద్రానికి శ్రీ నారాయణరావుగారిచే పంపబడ్డారు. అక్కడ నుండి నిజాం, రజాకార్ల వ్యతిరేకపోరాటాన్ని నిర్వహిస్తున్న సమయంలో ఆ కేంద్రాన్ని ఎత్తివేయగా తిరిగి రేపాల కేంద్రం చేరుకుని అక్కడ నుండి నిజాం వ్యతిరేకపోరాట కార్యక్రమాన్ని నిర్వహించారు.

1948 సెప్టంబర్ 17న భారత సైన్యాలు హైదరాబాదు సంస్థానంపై పోలీసుచర్య జరిపి హైదరాబాదును ఇండియన్ యూనియన్‌లో విలీనం చేశాక తిరిగి హనుమకొండ చేరుకొని చదువును కొనసాగించి ఆ పిదప అటవీ శాఖలో ఉద్యోగంలో ప్రవేశించి రేంజి ఆఫీసర్‌గా 1989 ఫిబ్రవరి 28న పదవీ విరమణచేశారు.

ప్రస్తుతం వరంగల్ జిల్లా, ములుగు తాలుకా పసర గ్రామంలో స్థిరనివాసం ఏర్పరుచుకొని వ్యవసాయవృత్తిలో స్థిరపడిపోయారు. 1974 భూసంస్కరణల చట్టం ప్రకారం తుంగతుర్తి వెంకట కృష్ణశాస్త్రి గారి 656 ఎకరముల మాగాణి భూమిలో రైతుల అధీనంలోని 356 ఎకరాల భూమిని, ప్రభుత్వ పరం కాకుండా నేరుగా రైతులకే చెందునట్లు హైకోర్టు ద్వారా స్వాధీనం చేయించుటకు కృషి చేసి విజయాన్ని సాధించారు .వారి శ్రీమతి కౌసల్యాదేవిగారితో ప్రస్తుతం పసర గ్రామంలో ప్రశాంత జీవనం గడుపుతున్నారు. ●

భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపన

**1925లో దేశంలో వివిధ ప్రాంతాలలో వుండే మార్క్సిస్టులంతా ఒకచోట సమావేశమై భారత కమ్యూనిస్టు పార్టీని స్థాపించుకొన్నారు.**




శ్రీ చెట్టి లక్ష్మయ్య గారు 1924 నవంబరు 11న కార్తీక శుద్ధ పౌర్ణమినాడు సికిందరాబాదు కు సమీపంలోని లాలాపేట గ్రామంలో శ్రీ చెట్టి సుబ్బయ్య అలియాస్ చిత్తారి - రాజమ్మ దంపతులకు జన్మించారు. 10వ తరగతి వరకు చదువుకున్నారు.

1941 జూన్ 16వ తేదీన నిజాం స్టేట్ రైల్వేస్‌లో సాంకేతిక శాఖలో అప్రెంటీస్‌గా ఉద్యోగంలో చేరారు. అదే సంవత్సరం డిశంబర్ నెలలో నిజాం రైల్వే కార్మికులు 45 రోజుల పాటు సమ్మె చేశారు. ఆసమ్మెలో అప్రెంటీసుగా వున్న శ్రీ లక్ష్మయ్య గారు కూడా పాల్గొన్నారు. అటు తరువాత 1942లో జాతిపిత మహాత్మాగాంధీ నాయకత్వాన జరిగిన ఆగష్టు విప్లవం (క్విట్ ఇండియా)లో ఉద్యోగంలో వుంటూనే ఆ ఉద్యమ కార్యకర్త లకు అజ్ఞాతంగా సహకరించారు. 1943లో ఆర్య సమాజములో చేరి లాలాపేటలో సమాజశాఖను స్థాపించి దాని ఆశయ సాధనకు కృషి చేశారు.

1947 నాటికి హైదరాబాదు స్టేట్ కాంగ్రేస్‌లో క్రియాశీలక కార్యకర్తగా పని చేయడం ప్రారంభించారు. 1947 జూన్ మొహర్రం ఏదోరోజున లాలాగూడా లాలాపేట గ్రామ కావలి శ్రీ ముత్తయ్యను రజాకార్లు చంపి నడిరోడ్‌పై పడవేసి అటుపిమ్మట అల్లాహో అక్బర్ అని నినదిస్తూ పీర్లతో లక్ష్మయ్య ఇంటిపై దాడి చేశారు. ఏమీ తోచని స్థితిలో ఆ తన వద్ద వున్న రెండు నాటు బాంబులను రజాకార్లపై విసరడంతో పాటు లోడింగ్‌లో వున్న తూపాకితో ఆత్మసంరక్షణ చేసుకోవడం కొరకు పేల్చి, తన వద్దనున్న జాషువాను, అతని నలుగురి పిల్లలను దొడ్డిదారిన తప్పించి అటుపిమ్మట శ్రీ లక్ష్మయ్యగారు సికిందరాబాదుకు వెళ్లి అత్త వారింటిలో తలదాచుకొని వారం రోజుల య్యాక లాలాపేటకు తిరిగి వచ్చారు. ఆ తరువాత మల్కాజిగిరి పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ శ్రీ నవాబు అలీ అను నాతడు శ్రీ లక్ష్మయ్య, చింతల చిన్న నరసింహులు గార్లపై 124 హెచ్.పి.సి. బల్వా 148 సెక్షన్ క్రింద కేసు నమోదుచేసి అప్పటి అత్రాఫ్ బల్ద జిల్లా సెషన్ కోర్టు ముందు హాజరుపరిచారు. జడ్జీగారు నేరుగా లాలాపేటను సందర్శించి నిజనిర్ధారణకై స్టేట్ ఎంక్వయిరీ జరిపి శ్రీ లక్ష్మయ్య, శ్రీ నర సింహులు గారలు నిర్దోషులని వారిపై మోపబడిన నేరం ఋజువు కానందున కొట్టివేశారు. తదుపరి లాలాపేట నుండి బొల్లారం కంటోన్మెంటు

ఆ తరువాత 4-12-1947న నిజాంపై శ్రీ నారాయణ పవార్, శ్రీ జగదీష్ ఆర్యా, గంగారాం ఆర్య నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్‌పై కింగ్‌కోఠిలో బాంబు ప్రయోగం చేశారు. ఆ వార్తను రేడియో ద్వారా తెలుసుకున్న శ్రీ లక్ష్మయ్య తన సహచర కార్యకర్త బాంబు కుట్రలో ఒకరు అయిన శ్రీ నారాయణ స్వామిని శ్రీ నాగభూషణం గారితో బెజవాడకు పంపేశారు ఆ తరువాత శ్రీ లక్ష్మయ్యగారు మద్రాసులో వున్న తమ నాయకుడు శ్రీ గాలయ్య విశ్వనాథంగారి దగ్గరికి వెళ్లి వెనక్కు తిరిగి వస్తుండగా విజయవాడలో సరిహద్దు పోరాట కేంద్రం నిర్వహిస్తున్న స్టేట్ కాంగ్రేసు నాయకులు శ్రీ హయగ్రీవాచారిగారి శ్రీ యస్.బి. గిరి గారలను కలుసుకున్నారు. 1948 జనవరి 1న శ్రీ యస్.బి. అనుపేరుతో గిరి నాయకత్వంలో సికిందరాబాదు కాంగ్రేసు సత్యాగ్రహ కమిటి ఆంధ్ర 'బి' ఫారం (ఏర్పాటు) అయింది. పరిటాల క్యాంపులో నేతాజీ సుభాష్ చంద్రబోస్ బాడిగార్డు శ్రీ రామ చంద్రన్‌వద్ద శిక్షణ పొందిన శ్రీ పాండు, శ్రీ యాదగిరి, శ్రీ టి. సత్యం, శ్రీ టి. మల్లయ్య గార్లతో కలిసి మారణాయుధాలతో ఎర్రు పాలెం రైల్వేస్టేషన్ సమీపంలోని పోలీసు స్టేషన్‌పై రాత్రి 10-11 గం॥ మధ్య దాడి జరిపారు. వియజాన్ని సాధించి విజయవాడ కు తిరిగి వెళ్లారు. అటుపిమ్మట 1948 జనవరి 30 తరువాత శ్రీ యస్.బి. గిరి జయ్‌ప్రకాశ్ నారాయణ్‌గారిచే స్థాపించబడిన సోషలిస్టు పార్టీలో చేరారు. తదుపరి శ్రీ లక్ష్మయ్య గారు శ్రీ వి.బి. రాజు గారి ఆధ్వ ర్యములో నిర్వహింపబడిన సత్యాగ్రహ లైన రజా కార్ల ఆగడాలు అంతం కావడానికి అవిశ్రాంతంగా కృషిచేసి హైదరాబాదు సంస్థానాన్ని భారత సైన్యాలు వశపరుచుకొని సంస్థాన ప్రజలకు విముక్తి కలిగించాక అజ్ఞాతము నుండి శ్రీ లక్ష్మయ్య గారు బయటపడి స్వేచ్ఛావాయువులను పీల్చుకున్నారు.

ఆ తదుపరి శాంతి కమిటీలను ఏర్పా రిచి హిందూ-ముస్లింలమధ్య శాంతి ఐక్యత నెలకొనుటకు మహాత్మాగాంధి సందేశాన్ని అందచేయడంలో ఎంతో కృషిచేశారు. లాలాపేట, సికిందరాబాదు అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొని చిలకలగూడా, సీతాఫల్‌మండి ప్రాంతీయులకు మంజీరా నీటి సరఫరా పథకాన్ని విజయవంతం చేయడంలోను, స్థానిక పాఠశాలను హైస్కూలుగాను, అది జూనియర్ కళాశాల గాను మార్పు చెందుటకు శ్రీ లక్ష్మయ్య తీవ్రమైన కృషి చేశారు. రేషన్ షాప్ ఓనర్స్ అసోషియేషన్‌ను ఏర్పాటు చేయడంతో పాటు ఇంకా ఎన్నో అభివృద్ధి కార్య క్రమాలను కొనసాగించారు శ్రీ లక్ష్మయ్య.

ప్రస్తుతం శ్రీ లక్ష్మయ్యగారు సికింద రాబాద్ స్వాతంత్ర్య సమరయోధుల సంఘం ప్రధాన కార్యదర్శిగా పదవీ బాధ్యతలు నిర్వహిస్తూ స్వాతంత్ర్య సమరయోధుల సంక్షే మానికై కృషిచేస్తున్నారు. వారు లాలాపేట లోని 12-1-286/287 ఇంటిలోకుమారులు, కూతుళ్ల మధ్య ప్రశాంత జీవనం సాగిస్తున్నారు. వీరి సతీమణి రమాదేవిగారు 25 సం॥ల క్రితం కీర్తిశేషులయ్యారు. శ్రీ లక్ష్మయ్యగారు బహుగ్రంథకర్త, చారిత్రక పరిశోధకులు కూడాను. ●

లులో చేరిన మొదటి వ్యక్తి శ్రీ లింగారెడ్డి గారు ఆ రోజుల్లో విద్యార్థి ఫెడరేషన్‌కు నాయకత్వం వహిస్తున్న శ్రీ ఓంకార్ ప్రసాద్, శ్రీ జవ్వాద్‌రజ్వీగార్లతో పరిచయం ఏర్పడి విద్యార్థి యూనియన్ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేవారు శ్రీ రెడ్డిగారు.

ఆ విధంగా కమ్యూనిష్టు పార్టీ స్థాపకులైన శ్రీ మగ్దుం మొహిద్దీన్, శ్రీ రాజ బహద్దూర్ గౌడ్‌గార్ల పరిచయం ఏర్పడింది. అప్పట్లో శ్రీ మఖ్దుమ్ మొహిద్దీన్‌గారు సిటీ కాలేజీ ఉర్దూ ఉపాధ్యాయులు.

అంతవరకు వున్న పరిస్థితుల నుండి రాజకీయంగా పెను మార్పులు రావడాన్ని గ్రహించిన నిరంకుశ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ మంత్రి వర్గములో కేవలం ముస్లింలనే కాకుండా కొందరు హిందువులను కూడా తీసుకొనెద్దనని ప్రకటించెను. ఆ స్థితిలో స్టేట్ కాంగ్రెస్, ఆంధ్రమహాసభ నిజాం ప్రకటనను నిరాకరించి సంస్థానములో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు కావాలని కోరాయి.

ఆ పరిస్థితులకు అనుగుణ్యంగా ప్రజాస్వామిక మార్పులు రావాలే తప్ప మంత్రి వర్గంలో హిందువులను చేర్చుకోవడం కాదు అనే నినాదాలతో సుల్తాన్ బజార్ సెంటర్‌లో వాల్‌పోస్టర్లు అంటించుచుండగా శ్రీ లింగారెడ్డిగారిని 1946 ఆగష్టులో అరెస్టు చేశారు. ఇంతలో 1947 ఆగష్టు 15న భారతదేశానికి స్వతంత్రం వచ్చింది. కాని నిజాం మాత్రం తన సంస్థానాన్ని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకొని ఇండి యన్ యూనియన్‌లో చేరబోవడం లేదని ప్రకటించెను. దానితో రాజకీయ పార్టీలన్నీ నిజాంకు, రజాకార్లకు వ్యతిరేకంగా ఉద్యమాలను తీవ్రతరం చేయగా నిజాం ప్రభుత్వము రాజకీయ పార్టీలను నిషేధించి పార్టీల నాయకులపైన, కార్యకర్తలపై తీవ్ర నిర్బంధాలను విధించింది. ఆ స్థితిలో పార్టీలనాయకులు కార్యకర్తలు అజ్ఞాతంలోకి వెళ్ళి నిజాం వ్యతిరేక సాయుధ పోరాటాన్ని సాగించారు. అట్టి సాయుధ పోరాట కార్యక్రమములో శ్రీ లింగారెడ్డి గారు ప్రముఖ పాత్రను నిర్వహించి 1948 సెప్టెంబరు 17న భారత సైన్యం హైదరాబాదు సంస్థానాన్ని స్వాధీనం చేసుకొని ఇండియన్ యూనియన్ లో చేర్చుకొనేంత వరకు శ్రీ రెడ్డిగారు తీవ్ర కృషి కొనసాగించారు. తదుపరి అజ్ఞాతం నుండి బయటకు వచ్చారు. ఆ తదుపరి కూడా కార్మికోద్యమం లో శ్రీ రెడ్డిగారు ముమ్మరంగా పనిచేశారు. కాని సైనిక చర్య తరువాత ఏర్పడిన మిలిటరీ ప్రభుత్వము కమ్యూనిష్టులను తిరిగి అరెస్టు చేయడం ప్రారంభించింది.

1949 ఫిబ్రవరి నెలలో తిరిగి శ్రీ లింగారెడ్డి గారిని హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వం అరెస్టుచేసి నిర్బంధంలో వుంచి తదుపరి జాల్నా జైలుకు తరలించింది. 1950లో తిరిగి హైదరాబాద్‌లోని సెంట్రల్‌జైలుకి మార్చారు. 1946 నాటి కేసుని 1949లో తిరిగి బనాయించి అదే నేరంతో 1950 వరకు నిర్బంధించి చివరకు కోర్టు ఆదేశంతో శ్రీ రెడ్డి గారిని విడుదల చేశారు. విడుదలయ్యాక తిరిగి కార్మికోద్యమాలలో యధావిధిగా పనిచేయసాగారు. ఇంకా మిలిటరీ పాలనకొనసాగుతూనే యున్నది. శ్రీ రెడ్డి గారిని మళ్లీ అరెస్టుచేసి ఈసారి ఔరంగాబాదు జైలుకు పంపారు. ఆ విధంగా పదహారు మాసాలు జైలులో వుండగా సుప్రీంకోర్టు ఆదేశంతో శ్రీ రెడ్డిగారిని విడుదల చేశారు. వీరి సతీమణి శ్రీమతి కాంతమ్మగారు కూడా నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొనిన వీర వనిత. రహస్య జీవితంలో ఆమె భర్త శ్రీ లింగారెడ్డిగారితో ఎన్నో ఇబ్బందులకు గురయ్యారు. సతీమణి కాంతమ్మగారితో ఇప్పుడు లింగారెడ్డిగారు స్వగ్రామం లో తుదకు మళ్ళీ ప్రశాంత జీవనం గడుపుతూ ఆధ్యాత్మిక చింతనలో నిమగ్నమై వున్నారు. ●

ులలో చేరిన మొదటి వ్యక్తి శ్రీ లింగారెడ్డి గారు ఆ రోజుల్లో విద్యార్థి ఫెడరేషన్‌కు నాయకత్వం వహిస్తున్న శ్రీ ఓంకార్ ప్రసాద్, శ్రీ జవ్వాద్‌రజ్వీగార్లతో పరిచయం ఏర్పడి విద్యార్థి యూనియన్ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేవారు శ్రీ రెడ్డిగారు.

ఆ విధంగా కమ్యూనిష్టు పార్టీ స్థాపకులైన శ్రీ మగ్దుం మొహిద్దీన్, శ్రీ రాజ బహద్దూర్ గౌడ్‌గార్ల పరిచయం ఏర్పడింది. అప్పట్లో శ్రీ మఖ్దుమ్ మొహిద్దీన్‌గారు సిటీ కాలేజీ ఉర్దూ ఉపాధ్యాయులు.

అంతవరకు వున్న పరిస్థితుల నుండి రాజకీయంగా పెను మార్పులు రావడాన్ని గ్రహించిన నిరంకుశ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ మంత్రి వర్గములో కేవలం ముస్లింలనే కాకుండా కొందరు హిందువులను కూడా తీసుకొనెదనని ప్రకటించెను. ఆ స్థితిలో స్టేట్ కాంగ్రెస్, ఆంధ్రమహాసభ నిజాం ప్రకటనను నిరాకరించి సంస్థానములో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు కావాలని కోరాయి.

ఆ పరిస్థితులకు అనుగుణ్యంగా ప్రజాస్వామిక మార్పులు రావాలే తప్ప మంత్రి వర్గంలో హిందువులను చేర్చుకోవడం కాదు అనే నినాదాలతో సుల్తాన్ బజార్ సెంటర్‌లో వాల్‌పోస్టర్లు అంటించుచుండగా శ్రీ లింగారెడ్డిగారిని 1946 ఆగష్టులో అరెస్టు చేశారు. ఇంతలో 1947 ఆగష్టు 15న భారతదేశానికి స్వతంత్రం వచ్చింది. కాని నిజాం మాత్రం తన సంస్థానాన్ని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకొని ఇండి యన్ యూనియన్‌లో చేరబోవడం లేదని ప్రకటించెను. దానితో రాజకీయ పార్టీలన్నీ నిజాంకు, రజాకార్లకు వ్యతిరేకంగా ఉద్యమాలను తీవ్రతరం చేయగా నిజాం ప్రభుత్వము రాజకీయ పార్టీలను నిషేధించి పార్టీల నాయకులపైన, కార్యకర్తలపై తీవ్ర నిర్బంధాలను విధించింది. ఆ స్థితిలో పార్టీలనాయకులు కార్యకర్తలు అజ్ఞాతంలోకి వెళ్ళి నిజాం వ్యతిరేక సాయుధ పోరాటాన్ని సాగించారు. అట్టి సాయుధ పోరాట కార్యక్రమములో శ్రీ లింగారెడ్డి గారు ప్రముఖ పాత్రను నిర్వహించి 1948 సెప్టెంబరు 17న భారత సైన్యం హైదరాబాదు సంస్థానాన్ని స్వాధీనం చేసుకొని ఇండియన్ యూనియన్ లో చేర్చుకొనేంత వరకు శ్రీ రెడ్డిగారు తీవ్ర కృషి కొనసాగించారు. తదుపరి అజ్ఞాతం నుండి బయటకు వచ్చారు. ఆ తదుపరి కూడా కార్మికోద్యమంలో శ్రీ రెడ్డిగారు ముమ్మరంగా పనిచేశారు. కాని సైనిక చర్య తరువాత ఏర్పడిన మిలిటరీ ప్రభుత్వము కమ్యూనిష్టులను తిరిగి అరెస్టు చేయడం ప్రారంభించింది.

1949 ఫిబ్రవరి నెలలో తిరిగి శ్రీ లింగారెడ్డి గారిని హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వం అరెస్టుచేసి నిర్బంధంలో వుంచి తదుపరి జాల్నా జైలుకు తరలించింది. 1950లో తిరిగి హైదరాబాద్‌లోని సెంట్రల్ జైలుకి మార్చారు. 1946 నాటి కేసుని 1949లో తిరిగి బనాయించి అదే నేరంతో 1950 వరకు నిర్బంధించి చివరకు కోర్టు ఆదేశంతో శ్రీ రెడ్డి గారిని విడుదల చేశారు. విడుదలయ్యాక తిరిగి కార్మికోద్యమాలలో యధావిధిగా పనిచేయసాగారు. ఇంకా మిలిటరీ పాలనకొనసాగుతూనే యున్నది. శ్రీ రెడ్డి గారిని మళ్లీ అరెస్టుచేసి ఈసారి ఔరంగాబాదు జైలుకు పంపారు. ఆ విధంగా పదహారు మాసాలు జైలులో వుండగా సుప్రీంకోర్టు ఆదేశంతో శ్రీ రెడ్డిగారిని విడుదల చేశారు. వీరి సతీమణి శ్రీమతి కాంతమ్మగారు కూడా నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొనిన వీర వనిత. రహస్య జీవితంలో ఆమె భర్త శ్రీ లింగారెడ్డిగారితో ఎన్నో ఇబ్బందులకు గురయ్యారు. సతీమణి కాంతమ్మ గారితో ఇప్పుడు లింగారెడ్డిగారు స్వగ్రామం లో తుదకు మళ్ళీ ప్రశాంత జీవనం గడుపుతూ ఆధ్యాత్మిక చింతనలో నిమగ్నమై వున్నారు. ●




శ్రీ వెంకట రెడ్డిగారు కర్నూలుజిల్లా ఆత్మకూరు తాలూకా వెలుగోడు గ్రామంలో జన్మించారు. అదేగ్రామంలో ప్రాథమిక విద్యను పూర్తిచేశారు. 1935-38 సంవత్స రాలమధ్యకాలంలో కర్నూల్ మున్సిపల్ హైస్కూల్‌లో విద్యను అభ్యసించారు. హైస్కూలులో వున్నప్పుడే భారతజాతీయోద్య మముపట్ల, రష్యా నవంబరు విప్లవ వీరగాధలపట్ల ప్రభావితులై వాటి ప్రేరణలతో (1937) రాజకీయ రంగ ప్రవేశం చేశారు. 1938లో జాతీయోద్యమ నాయకురాలు అనిబిసెంటమ్మ మదనపల్లిలో స్థాపించిన థియసాఫికల్ కాలేజీలో ఇంటర్మీడియట్‌లో ప్రవేశించారు. కాలేజీ సమ్మెల్లో పాల్గొని మూడు సార్లు సస్పెండ్ చేయబడ్డాడు. నాలుగోసారి తనంతటతానే కళాశాలను బహిష్కరించారు. కళాశాల వదిలాక విద్యార్థి యువజన సంఘాల నిర్మాణానికి తీవ్ర కృషి చేశారు. 1942 ఆగస్టు ఉద్యమంలో నాయకుల అరెస్టుకు నిరసనలు తెలుపుతూ సభలు, సమావేశాలు నిర్వహించడంతో పాటు అనేక రహస్య కార్యక్రమాలు చేపట్టారు. ఫలితంగా అరెస్టు చేయబడి ఒక సంవత్సరంపాటు బళ్ళారిజైలులో కఠిన కారాగారవాస శిక్షను అనుభవించారు. విడుదలయ్యాక కమ్యూనిస్టు పార్టీలో పూర్తిస్థాయి కార్యకర్తగా నియమింపబడ్డారు.

ఆనాటి నుంచి విద్యార్థి, యువజన, ఉపాధ్యాయ, రైతు సంఘాల నిర్మాణానికి ఒకవైపు కృషిచేస్తూ రెండవవైపు రాయలసీమ సమస్యల పరిష్కారానికి కృషిచేస్తూ ఇంకొకవైపు సాహిత్య, సంఘ సంస్కరణోద్య మాల వ్యాసంగములో ముమ్మరంగా పాల్గొనే వారు. 1943లో వర్ణాంతర వివాహం చేసుకున్నారు. ప్రకాశం ఆర్డినెన్సుతో వారెంటు జారీచేయబడి 6నెలలు పాటు రహస్య జీవితం గడిపి అజ్ఞాతంలో వుండగా అరెస్టు కాబడి బళ్లారి సెంట్రల్ జైలులో డిటెన్యూగా వుంచబడ్డారు. బళ్లారి నుండి రాజమండ్రి జైలుకు మార్చినపుడు పరిగెత్తుతున్న రైలు నుండి కిందకి దూకి 3సంవత్సరాల పాటు రహస్య జీవితం గడిపారు. 1949లో తిరిగి అరెస్టు చేయబడి డిటెన్షన్‌లో వుండగా కోర్టు ఆదేశంతో విడుదల చేయబడ్డారు. కొంతకాలం కర్నూల్ జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా పదవీ బాధ్యతలు నిర్వహించారు. పాలసీల సైద్ధాంతిక విభేదాల వల్ల అంతర్గతపోరాటం జిల్లా కమిటీలో ఏర్పడి కమ్యూనిస్టు పార్టీ నుంచి 1962లో బయటపడ్డారు. ప్రస్తుతం వ్యవసాయ కార్య క్రమంలో నిమగ్నమై సాహిత్యం, సంఘ సంస్కరణ సమర యోధుల సమస్యల వ్యాసంగం పట్ల తమ కృషిని కొన సాగిస్తున్నారు. కర్నూలు జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంస్థకు అధ్యక్ష పదవీ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. శ్రీశైలంలో జరిగిన15వ రాష్ట్రస్థాయి స్వాతంత్ర్య సమరయోధుల మహాసభకు ఆహ్వాన సంఘం కార్యనిర్వాహక అధ్యక్ష పదవీ బాధ్యతలను నిర్వహించారు. ప్రస్తుతం వీరి వయస్సు 76 సంవత్స రములు. సతీమణి రాములమ్మ గారితో స్వగ్రామం వెలిగోడులో శేషజీవితాన్ని ప్రశాంతంగా గడుపుతున్నారు.





## శ్రీ కంకణాల వెంకటరెడ్డి

## శ్రీమతి కంకణాల సౌందర్యమ్మ

శ్రీకంకణాల వెంకటరెడ్డి అలియాస్ చినవెంకటరెడ్డిగారు 1920మే 5న నల్లగొండ జిల్లా, రామన్నపేట తాలూకా పల్లివాడ గ్రామంలో జన్మించారు. 1939 సంవత్సరంలో నల్లగొండజిల్లాకు చెందిన ఏడుగ్రామాల వారు గ్రామానికి ముగ్గురేసి చొప్పున పోలీసు పటేల్, మాలీ పటేల్, పట్వారీలకై నిర్వహింపబడే పరీక్షలలో పాల్గొనుటకై జిల్లా కేంద్రమైన నల్లగొండకు వెళ్లారు. అట్టివారిలో శ్రీకంకణాల వెంకటరెడ్డిగారు ఒకరు.

ఆ విధంగా పోలీసు పటేల్, మాలీపటేల్, పట్వారీపరీక్షలకై నల్లగొండకు వెళ్లిన వారందరికీ శ్రీ కట్టరామిరెడ్డిగారు వందే మాతరం ఉద్యమం దాని ప్రాముఖ్య తను గూర్చి ప్రబోధించారు. ఆరోజు నుండి శ్రీ కంకణాల వెంకటరెడ్డిగారికి స్వాతంత్ర్యో ద్యమం పట్ల ఆసక్తి కలిగింది. అటు పిమ్మట శ్రీ వెంకట రెడ్డిగారు 1941లో శ్రీ రావి నారాయణ రెడ్డిగారి అధ్యక్షతన జరిగిన ఎనిమిదవ ఆంధ్రమహాసభ దిగ్విజయంగా జరుగుటకు శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డిగారు శ్రీ మతి ఆరుట్ల కమలాదేవిగారు అందించిన స్ఫూర్తితో భారీగా విరాళాలను ప్రోగుచేశారు ఆ పిదప 1944లో భువనగిరిలో శ్రీ రావినారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన 11వ ఆంధ్రమహాసభకు కూడా హాజరయ్యారు

ఆ తరువాత 1947 సెప్టెంబరు నెలలో వలిగొండ మండలం మొగిలిపాక గ్రామ వాస్తవ్యులు శ్రీ ముద్దసాని వెంకట నరసింహారెడ్డి (మొగిలిపాక గాంధీ) నుంకి శాల గ్రామవాస్తవ్యులగు శ్రీ పైళ్ల రామచంద్రా రెడ్డిగారి గ్రామమైన పల్లివాడ గ్రామాన్ని సందర్శించినప్పుడు వారికి డప్పులతో స్వాగతము పలికి శ్రీ వెంకటరెడ్డిగారి వద్దవున్న తుపాకిని, కత్తిని తపంచాలును వాటితోపాటు పోలీసు పటేల్ రికార్డును శ్రీ లక్ష్మీనర సింహారెడ్డి, శ్రీరామచంద్రారెడ్డిగారలకు అప్పజెప్పి నిరంకుశ నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొనడానికి ప్రతిన జేశారు

అప్పటినుండి పల్లివాడ గ్రామం ఆ చుట్టు పట్ల గ్రామాలకు స్వాతంత్ర్యోద్యమ కేంద్రంగా మారింది. దానితో నిజాం ప్రభుత్వం రజాకార్లు శ్రీ వెంటకరెడ్డిగారి కుటుంబంపై ఒక కన్ను వేశారు. నిజాం

పోలీసులు, రజాకార్లు ఆగ్రామంపై దాడిచేసి గ్రామాన్నంతా బీభత్సంచేసి ఎంతో నష్టాన్ని కలిగించడమే గాకుండా ఆకుటుంబంపై హత్యాప్రయత్నం కూడా చేశారు. ఏదో విధంగా వెంకటరెడ్డిగారు, ఆయన కుటుంబం నిజాం పోలీసులు, రజాకార్ల బారిన పడకుండా తప్పించుకొని వెళ్ళి నిజాం వ్యతిరేక పోరాటాన్ని ముమ్మరంగా చేసి నిజాంపాలన, రజాకార్ల దౌర్జన్యాలు అంతంకావడానికి ఎదురొడ్డి నిలిచారు. ఈ విషయాన్ని ఆరోజుల్లో హైదరాబాదు నుండి ప్రచురించబడే గోలుకొండపత్రిక ప్రచురించింది. 1948 సెప్టంబర్ 17 భారత సైన్యాలు సైనిక చర్య ద్వారా హైదరాబాదు సంస్థానాన్ని స్వాధీన పరచుకుని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేశాక శ్రీవెంకట రెడ్డిగారు బహిరంగంగా బయటి ప్రపంచం లోకి వచ్చారు.

1951లో ఆచార్య వినోబాభావేగారు నల్లగొండ జిల్లా పోచంపల్లి గ్రామాన్ని సందర్శించి భూదానోద్యమ కార్యక్రమానికి అంకురార్పణ చేసిన నాటినుండి ఆ ఉద్యమంలో ఆచార్య వినోబాభావే గారితో వుండి రామన్నపేట తాలూకాలోని తంగడపల్లి, సిలువేరు మొదలుగా గల గ్రామాలలో భూదానాన్ని సేకరించారు. ఆ విధంగా రామన్నపేట తాలూకా భూదానోద్యమ కన్వీనర్‌గా కొంతకాలం పనిచేశారు. తాలూకా కేంద్రమైన రామన్నపేటలో ఉన్నత పాఠశాల స్థాపన నిమిత్తము తహసీలుదారు శ్రీ రంగారావు గారితో కలసి విరాళాలు ప్రోగుచేసి ఉన్నత పాఠశాలను స్థాపించారు. ఆ పాఠాలకు అప్పటి హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ బూర్గులరామకృష్ణా రావుగారు ప్రారంభోత్సవము చేశారు. శ్రీ వెంకట రెడ్డిగారు ప్రస్థుతం తమ స్వగ్రామమైన పల్లివాడలో ప్రశాంత జీవనం గుడుపుతున్నారు. వీరి సతీమణి శ్రీమతి సౌందర్యమ్మగారు 23-8-1976న కీర్తిశేషులయ్యారు.

## స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహం

*సుల్తాన్ బజారు, కాచిగూడ రైల్వే స్టేషన్, పత్తర్ ఘట్టి మొదలైన ప్రాంతాల్లో మొట్టమొదటిసారిగా 1938 అక్టోబర్ 27 కాంగ్రేసు నాయకులు 400 మంది సత్యాగ్రహులతో 18 బృందాలుగా ఏర్పడి నిజాం సర్కారుకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేశారు. సత్యాగ్రహం చేసినవారిలో శ్రీ రావినారాయణరెడ్డి, శ్రీ కాళోజీ నారాయణ రావు, శ్రీమతిఎల్లాప్రగడ సీతాకుమారి లాంటి ప్రముఖులు వున్నారు.*



## శ్రీ సర్రాపు వెంకటేశ్వర రావు



## శ్రీమతి సర్రాపు కౌసల్యా బాయి

శ్రీ సర్రాపు వెంకటేశ్వర రావుగారు 1927 జూన్ 4వ తేదీన మహబూబ్‌నగర్ జిల్లా, బాలానగర్ మండలం కుచ్చుర్‌కల్ గ్రామంలో సర్రాపు అమృతరావు రాధాబాయి దంపతులకు జన్మించారు. పదవతరగతి వరకు చదువుకున్నారు. జాతిపితమహాత్మ గాంధీ ప్రవచించిన నిర్మాణ కార్యక్రమాలతో స్ఫూర్తినిపొందిన శ్రీ వెంకటేశ్వరరావు స్వగ్రామంలో 1940 నుండి అస్పృశ్యతా నివారణ, పారిశుధ్య కార్యక్రమాలను చేపట్టి పనిచేయసాగారు. అట్లుండగా ఆ రోజుల్లో ఒకనాడు ఆర్యసమాజనాయకుడు పండిత నరేంద్రజీ మహబూబ్‌నగర్‌ను సందర్శించినపుడు వారి ఉపన్యాసం వలన ప్రేరణ పొంది నిజాం నిరంకుశ పాలనకు, మతోన్మాదులైన రజాకార్లకు వ్యతిరేకంగా రాజకీయ కార్యక్రమాన్ని రూపొందించుకొని స్వగ్రామం కుచ్చురకల్ లోను, పరిసర గ్రామాలలోను పనిచేయసాగారు. 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్రం ప్రకటించబడింది. కాని హైదరాబాదు సంస్థాన ప్రజలకు స్వతంత్రం లభించలేదు. హైదరాబాదు సంస్థాన ప్రజల విముక్తికై స్టేట్ కాంగ్రేసు ముమ్మరంగా పనిచేయసాగింది. వ్యూహాత్మకమైన కార్యక్రమాలను ఏర్పాటు చేసి సరిహద్దుపోరాటాల ద్వారా నిజాం పాలనను అంతమొందించడానికి సర్వ విధములైన కార్యక్రమాలను రూపొందించింది. ఆ కార్యక్రమాలలో పన్నుల నిరాకరణ, లెవీధాన్యం నిరాకరణ, గ్రామగ్రామాన జాతీయ జండాలు ఎగురవేయడం, ప్రభుత్వానికి ఆదాయం రాకుండా చేయడానికి గాను కల్లుగీత నిషేధానికి ప్రజలను పురికొల్పడం ఆదిగా గల కార్యక్రమాలతోపాటు సంస్థానానికి ఆవలి వైపున స్వతంత్రభారతంలోని సరిహద్దుల నుండి సాయుధులైన స్వచ్ఛంద సేవకులు ప్రభుత్వంపై దాడి చేయడం లాంటివి కూడా నిజాం కూల్చివేత కార్యక్రమాల్లోని భాగమే.

అట్టి కార్యక్రమాల్లో మొదటి తరహా కార్యక్రమాన్ని శ్రీ వెంకటేశ్వరావుగారు ఎంచుకొని గ్రామాల్లో జాతీయ జెండాను

ప్రతిష్ఠించడం, లెవీధాన్యసేకరణకు పన్నుల వసూళ్లకు వ్యతిరేకంగా పనిచేయడం ప్రారంభించారు శ్రీ వెంకటేశ్వరరావు. 1947 ఆగస్టు 16న జాతీయ జెండాను ప్రతిష్ఠించగా నిజాం పోలీసులు అరెస్టుచేసి నిర్బంధంలోకి తీసుకొనుటకు ప్రయత్నించగా అరెస్టును తప్పించుకొని తుంగభద్రకు ఆవల స్వతంత్ర భారతావనికి చెందిన కర్నూలు కు వెళ్లిపోయారు. అక్కడ నుండి స్టేట్ కాంగ్రేసు పిలుపు మేరకు శ్రీ అచ్యుత రెడ్డి శ్రీ పల్లెర్ల హనుమంతరావు, శ్రీ ఏగూరి చెన్నప్ప, శ్రీ సురభి శేషశర్మ, కొత్తకేశవులు గారల ఆదేశాల మేరకు నిజాం ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలను ముమ్మరంగా చేస్తూ, ప్రభుత్వ ఆస్తులను విధ్వసం చేయసాగారు. భారతసైన్యాలు 1948 సెప్టెంబరు 17న హైదరాబాదు సంస్థానాన్ని స్వాధీనం చేసుకొని హైదరాబాదును ఇండియన్ యూనియన్ లో విలీనం చేసేంత వరకు అజ్ఞాత యోధునిగా పనిచేశారు. అప్పటి నుండి ఇప్పటి వరకు సర్వోదయ కార్యక్రమాల్లో కార్యకర్తగా పనిచేస్తున్నారు .1947-48 సంవత్సరాలలో స్టేట్‌కాంగ్రెస్ ప్రతినిధిగా అచ్చంపేట తాలూకా నుండి ఎన్నుకోబడి సతీమణి అహల్యాబాయితో న్యానల్ నగర్ కాంగ్రెసుకు హాజరయ్యారు. 1952 నుంచి, భూదానోద్యమంలో పాల్గొన్నారు. పోస్టల్ డిపార్టుమెంటులోని Extra departmental workers union ను స్థాపించి వారిని వెట్టి చాకిరి నుంచి విముక్తి చేయటానికి కృషి చేశారు. ప్రస్థుతం ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల సంస్థకార్యవర్గ సభ్యులుగా పదవీ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. వీరి సతీమణి అహల్యాబాయి గారితో కుచ్చర్‌కల్ గ్రామంలో ప్రశాంత జీవనం గడుపుతున్నారు. ●

## హైదరాబాద్‌లో క్విట్ ఇండియా ఉద్యమం

*1942 ఆగస్టు 9 నుండి భారత దేశమంతటా నిర్వహింపబడిన క్విట్ ఇండియా ఉద్యమం హైదరాబాదు సంస్థానంపై తన ప్రభావాన్ని కలిగించింది. ఈ ఉద్యమంలో హైదరాబాదు సంస్థానము నుండి స్వామి రామానంద తీర్థ, శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీమతి పద్మజా నాయుడు, శ్రీకాళోజి నారాయణరావుగారలు పాల్గొన్నారు. వారందరిని నిజాం సర్కార్ అరెస్టు చేసింది.*





## శ్రీ తోపుల వెంకయ్య

శ్రీ తోపుల వెంకయ్యగారు మెదక్‌జిల్లా, శంకరంపేట మండలం, చందంపేట గ్రామంలో 1925 అక్టోబర్ 10న జన్మించారు. ఉర్దూ బోధనా భాషగా పదవతరగతి వరకు చదువుకున్నారు.

1938లో హైదరాబాదులోని ప్రభుత్వ కుటీర పరిశ్రమల శిక్షణా కేంద్రంలో చేనేతకు సంబంధించిన సాంకేతిక పరమైన ఆంగ్లపదాలను వాటి కంపోజిషన్‌ను కూడా అభ్యసించారు.

హైదరాబాదు విముక్తి పోరాటంపట్ల ప్రభావితుడైన శ్రీ వెంకయ్య స్వామి రామా నందతీర్థ నాయకత్వంలోని కాంగ్రెసు పట్ల అభిమానం కలిగి రహస్యంగా కాంగ్రెసు కార్యకర్తలకు సహాయపడుతుండేవారు స్వాతంత్ర్యం వచ్చింది. కాని హైదరాబాదు సంస్థాన ప్రజలకు స్వాతంత్ర్యం లభించలేదు. పైగా హైదరాబాదు స్వతంత్ర దేశంగా వుంటుందని ప్రకటించాడు నిజాం. దానితో కాంగ్రెసు, కమ్యూనిష్టు పార్టీలు ఉద్యమాన్ని ఉధృతంచేశాయి. లక్షలాది మంది ప్రజలు నిజాం వ్యతిరేకంగా కాంగ్రెసు, కమ్యూనిష్టు, ఆంధ్రమహాసభల ద్వారా తిరుగుబాటు చేశారు. ఉద్యమాన్ని అణచడానికి నిజాం తన పోలీసులతో పాటు ఖాశిం రజ్వీ నాయకత్వంలోని మతదురహంకారులైన రజాకార్లను సంస్థాన ప్రజలపై ఉసిగొలిపాడు. అంతేగాకుండా సివిల్ ఉద్యోగస్థులందరిని ప్యారామిలటరీలో చేరి భారత్‌కు వ్యతిరేకంగా కవాత్ ప్రదర్శన జరపమని ఆదేశించాడు నిజాం. ఒక ఉద్యోగిగా దానిని ఎదిరించిన శ్రీ వెంకయ్యగారిని పరిశ్రమల కేంద్రంలోని సూపర్‌వైజర్ సలహామేరకు 10-4-1948న పోలీసులు అదుపులోకి తీసుకొని హింసించారు. అతికష్టం మీద పోలీసుల బారినుండి బయటపడిన శ్రీ వెంకయ్య 10-6-1948 నాటికి మెదక్ జిల్లాలోని తన స్వగ్రామమైన చందంపేటకు చేరారు. తన గ్రామం చందంపేట పరిసర గ్రామాలలో కాంగ్రెసు ఆదేశాలమేరకు నిజాం వ్యతిరేక పోరాటంలో భాగస్వాములు కావలసిందని గ్రామీణ ప్రజలను ఉత్తేజ పరచసాగారు. శ్రీ వెంకయ్యగారిని చందం పేట నుండి బయటగ్రామాలకు వెళ్లకుండా నిషేధం అమలుజేశారు. అదే సమయంలో 2-7-1948న ఉద్యోగం నుండి బర్తరఫ్ చేసినట్లు ఆదేశాలు అందాయి. ఆ తరువాత నెలన్నరకు భారతసైన్యాలు హైదరాబాదు సంస్థానంపై సైనిక చర్య జరిపి హైదరాబాదు సంస్థాన ప్రజలను నిజాం కబంధకౌగిలి నుండి విముక్తం చేశాయి.

అటుపిమ్మట 19-1-1957 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిశ్రమలశాఖలో శ్రీవెంకయ్య గారికి తిరిగి ఉద్యోగం వచ్చింది. ప్రస్తుతం హైదరాబాదు పార్శిగుట్టలోని సంజీవ పురంలో 11-3-664/162 ఎ ఇంటిలో సతీ మణితో ప్రశాంత జీవనం సాగిస్తున్నారు. ●

## శ్రీమతి వెంకయ్య





## శ్రీ కస్తూరి శ్రీరాములు నాయుడు

## శ్రీమతి కస్తూరి శారదాదేవి

శ్రీ కస్తూరి శ్రీరాములు నాయుడు 1914లో తమిళనాడుకు చెందిన సేలంలో శ్రీ అప్పావునాయుడు సుందరమ్మ దంపతులకు జన్మించారు. శ్రీ నాయుడు గారికి 7 ఏళ్ల వయస్సున్నపుడు తండ్రి శ్రీ అప్పావు (అప్పారావు) నాయుడుగారు ఉద్యోగ రీత్యా సికిందరాబాదుకు వచ్చి స్థిరపడి పోయారు.

శ్రీ నాయుడుగారు ఎనిమిదవ తరగతి వరకు మాధ్యమిక విద్యను సికిందరాబాదు లోని మహబూబ్ కాలేజీలో అభ్యసించారు. ఆ రోజుల్లోనే ఆయనకు మంచి క్రికెట్ ప్లేయర్‌గా పేరు వుండేది. అందువలన మిలిటరీ ఉద్యోగానికి సెలక్ట్ అయ్యారు. నాలుగు సంవత్సరాల పాటు మిలిటరీలో ఉద్యోగం చేశాక రెండో ప్రపంచ యుద్ధం జరుగుతున్న సమయంలో జపాన్‌కు పంపడానికి ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశించింది.ఆ ఆదేశాన్ని శ్రీ నాయుడు గారు తిరస్కరించారు. దానితో అతనిపై ప్రభుత్వము కన్నుపడింది. అందువలన శ్రీ నాయుడుగారిని ప్రభుత్వ వ్యతిరేకి గాను జాతీయోద్యమ కార్యకర్తగాను ప్రభుత్వం ముద్ర వేసింది. ఎలాగు ప్రభుత్వము ముద్రవేసింది గనుక హైదరాబాదుకు తిరిగి వచ్చి అటు బ్రిటిష్ ప్రభుత్వానికి , ఇటు నిరంకుశ నిజాం సర్కారుకును, ముస్లిం మతోన్మాదులైన రజాకార్లకు వ్యతిరేకంగా 1938 నుండి పోరాటం సాగించారు, ఫలితంగా ఆయనకు ఆరుమాసాలకు పైబడి కఠిన కారాగార జైలు శిక్ష విధించబడింది. జైలు శిక్షతో పాటు పదిరూపాయలు జుల్మానా కూడా విధించారు. దానిని చెల్లించనిచో మరొక 15 రోజులు జైలు శిక్ష అనుభవించాలని హైదరాబాదు క్రిమినల్ కోర్టు తీర్పు చెప్పింది. మొదట్లో హైదరాబాదు సెంట్రల్ జైలులో వుంచి అటుపిమ్మట నిజామాబాదు జిల్లా జైలుకు శ్రీ నాయుడుగారు పంపబడ్డారు. ఈ రెండు జైళ్లలో శ్రీ నాయుడు గారు 5 మాసాల 15 రోజుల శిక్షను అనుభవించారు. జైలు శిక్షపూర్తవ్వక ముందే విడుదల చేయబడ్డారు.

సైనిక చర్య వలన హైదరాబాదు సంస్థానం నిజాం కబంధ హస్తముల నుండి విముక్తం పొందాక తిరిగి హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వంలో ఫైర్ సర్వీసు శాఖలో ఉద్యోగంలో ప్రవేశించి క్రమశిక్షణ కలిగిన కార్యకర్తగా ఉద్యోగధర్మాన్ని నిర్వర్తించి పదవీ విరమణ చేశారు. ప్రస్థుతం శ్రీ నాయుడు గారి వయస్సు 84 సంవత్సరాలు. ఇపుడు శ్రీ నాయుడు గారు ఆయన సతీమణి శారదా దేవిగారితో రంగా రెడ్డిజిల్లా, ఘటకేశ్వర్ మండలానికి చెందిన చెర్లపల్లి గ్రామంలో ప్రశాంత జీవనం గడుపుతున్నారు. ●



## శ్రీమతి వేములపల్లి సత్యవతి

## శ్రీ వెంపో

దేశమాత పాదపద్మాలపై పూజా పుష్పాలుగా విరాజిల్లాలనే తపనతో భారతయువత ఎల్లెడలా అపూర్వత్యాగాలకు సంసిద్ధమౌతున్న రోజులవి. అలాంటి సత్సంకల్పంతో ఇంటివద్ద చెప్పాపెట్టకుండానే సేవాగ్రాం ఆశ్రమంలో గాంధీమహాత్ముని పాదసన్నిధికి చేరుకొన్న ఒక యువకుడు-

ఆ విధంగానే తెలంగాణా భూస్వామ్య కుటుంబంలో పుట్టి పడతిగా పరదాచాటున పడివుండలేక ఒంటిగా అరుణోదయం దిక్కుగా పయనమై విజయవాడలో కమ్యూనిష్టు పార్టీ కమ్యూన్‌లో చేరిన ఒక యువతి- ఆదర్శపరంగా భిన్నమార్గాలను యెన్నుకున్నప్పటికి ఆ తర్వాత కాలంలో జీవిత భాగస్వాములు కూడా కావటం విశేషం. వారే వెంపో- సత్యవతి దంపతులు.

సుప్రసిద్ధ రచయితలుగా పేరుపొందిన శ్రీ వెంపో గారి పూర్తినామధేయం పొట్లూరి వెంకటేశ్వరరావు. శ్రీ రామకోటయ్య నాగరత్నమ్మ దంపతులకు శ్రీ వెంపోగారు 1927లో జన్మించారు. వ్యవసాయం వృత్తిగా కలిగిన శ్రీ రామకోటయ్యగారు భగవద్గీత అష్టాదశ అధ్యాయాలను వేకువ ఝామున శ్రవణపేయంగా ఎలుగెత్తిగానం జేసిన తర్వాత గాని కర్తవ్యోన్ముఖుడై కార్యరంగం లోనికి దిగేవారుకాదు. భాషా పరంగా ఇది శ్రీ వెంపో గారిజీవితంపై గట్టి ముద్రను వేయటం జరిగింది. స్వగ్రామం కృష్ణాజిల్లా మండవల్లి మండలం మొఖాసాకలవపూడి. బాల్యంలోనే సేవాగ్రామ్ ఆశ్రమంలో సేవాతత్పరులైన త్యాగశీలుర మధ్య సుక్షితుడై 1947లో కర్నూలు జిల్లాను సేవాక్షేత్రంగా శ్రీ వెంపో గారు యెన్నుకోవటం జరిగింది.

కర్నూలుకు సరిహద్దునగల మహబూబ్ నగర్ జిల్లా జట్‌ప్రోలు సంస్థాన గ్రామాలలో నిజాం వ్యతిరేకపోరాటంలో శ్రీ వెంపోగారు తన వంతు కృషి చేసిన ప్రజాసేవకుడు.

శ్రీమతి వేములపల్లి సత్యవతిగారు నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా బీబీగూడెం గ్రామంలో శ్రీ నరసయ్య, యశోదమ్మ దంపతులకు 1928లో జన్మించారు. ఈమె పినతండ్రి శ్రీ వేములపల్లి భాస్కరరావుగారు సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధులు. ఆకాలంలోనే పట్టభద్రులై వుండి హైదరాబాదు రాష్ట్రంలో వున్నత ప్రభుత్వోద్యోగాన్ని కాదని సంస్థాన విమోచనోద్యమంలో శ్రీ భాస్కరరావుగారు

తలమునకలై వుండటం శ్రీమతి సత్యవతి గారి జీవితంమీద గణనీయమైన ప్రభావాన్ని కలిగించటం జరిగింది.

స్వాతంత్ర్యం కొరకు సంస్థాన ప్రజల్ని చైతన్య పరచిన ప్రారంభోద్యమమైన ఆంధ్ర మహాసభ కార్యక్రమాల విషయమై శ్రీ యుతులు దేవులపల్లి వెంకటేశ్వరరావు ఆయన సోదరుడు రాఘవేంద్రరావు, సుబ్బారావు ప్రభృతులు పినతండ్రి భాస్కర రావుగారి దగ్గరకు నిత్యం వచ్చి పోతుండటం బాలికగా సత్యవతిగారు కడుశ్రద్ధగా పరిశీలిన్తూ వుండేవారు. గృహలక్ష్మి మొదలుగాగల పత్రికలలో మాగంటి అన్నపూర్ణమ్మ,గుమ్మిడిదల దుర్గాబాయమ్మ లాంటి జాతీయోద్యమ నాయకురాళ్ల వీరోచిత గాథలు సత్యవతిగారి మనస్సుకు బాగా హత్తుకొనేవి.

ఆంధ్రప్రాంతం నుంచి శ్రీ మునిపల్లె రామారావుగారు పిల్లలకు చదువుచెప్పటం కోసమంటూ అజ్ఞాత కమ్యూనిష్టు యోధు నిగా బీబీగూడెంలో తలదాచు కోవటానికి రావటం సత్యవతిగారి ఆలోచనలకు ఒక రూపంకల్పించటానికి బాగా తోడ్పటం జరిగింది. నల్లగొండ జిల్లా కమ్యూనిష్టు వుద్యమానికి తలమానికంగా వుండటం అందరెరిగిందే! జిల్లాలో గ్రామ గ్రామాన కమ్యూనిష్టు దళాలు ప్రవేశించి ప్రజల్ని నిజాం వ్యతిరేకవుద్యమానికి సంసిద్ధంచేస్తున్నాయి. తెలుగునాట కమ్యూనిష్టు వుద్యమానికి ఆనాడు బెజవాడ కేంద్రంగా వుండేది. ఆ విషయం తెలుసుకున్న సత్యవతిగారు తిన్నగా అక్కడికే ప్రయాణాన్ని కొనసాగించటంలో ఆశ్చర్యమేముంది?

అయితే ఈమె యింటినుంచి ఎవరికీ చెప్పకుండా విజయవాడలోని కమ్యూనిష్టు పార్టీ కమ్యూన్‌లో చేరటం తెలంగాణాలోని కాంగ్రెస్, కమ్యూనిష్టు పార్టీల మధ్య పెద్ద వివాదంగా మారింది. సత్యవతి కుటుంబీకులు కాంగ్రెసు అభిమానులు కావటం వల్ల కమ్యూనిష్టులు తమ కుమార్తెను అపహరించుకు పోయి నట్లుగా ఫిర్యాదు చేశారు. ఆ విషయం కొత్వాల్ వెంకట్రామా రెడ్డిగారి వరకు వెళ్ళి ఉభయపార్టీల వారిని పిలిచి ప్రశ్నించగా ఇందులో కమ్యూనిష్టులది యేమీ తప్పులేదని తేలింది. ఈ విషయాన్ని "తెలంగాణా పోరాటం" అనే దేవులపల్లి వెంకటేశ్వరావు గారి గ్రంథంలో ఉటంకించారు.

శ్రీ యుతులు పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు ప్రభృతుల ఆదరణతో శ్రీమతి డా. కొమర్రాజు అచ్చమాంబగారి అడుగుజాడల్లో శ్రీ మతులు తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజిని, బొప్పన ప్రభావతి, నూతక్కి ఇందిర మొదలైన మహిళామణుల సాహచర్యంలో మహిళలను జాగృత పరచటంలో శ్రీమతి సత్యవతిగారు ముందడుగు వేశారు. సంస్థాన విముక్తి జరిగిన తర్వాత తెలంగాణాలో ఉపాధ్యాయినిగా చేరి వుద్యోగవిరమణ తర్వాత యేడు పదులు నిండిన తన శేషజీవితాన్ని వెంపో గారితో కలసి మొఖాసాకలవపూడిలో ప్రశాంతంగా గడుపు తున్నారు.

దేశస్వాతంత్ర్యానికై యథోచిత కృషి చేసిన యీ దంపతుల ప్రథమ పుత్రుడు దేశరక్షణ దళాలలో లెఫ్టినెంట్ కర్నల్ షా పాట్లూరిగా అంచెలంచలుగా ఎదిగి రావటం ముదావహమైన విషయం. ●



## శ్రీమతి బండారు సరోజిని

ఈ గ్రంథ సంకలన కర్తగా శ్రీమతి సరోజిని జీవితాంశాలను యిక్కడ పొందు పరచటానికి నేను సంసిద్ధమైనపుడు నాకు కొన్ని యిబ్బందికరమైన పరిస్థితులు సహజంగానే యెదురయ్యాయి. కారణం నాకు సరోజిని అర్ధాంగి కావటమే! అయినా "మరుగునపడిన అభిమానధనులు" అన్న యీ గ్రంథనామధేయానికి సరితూగగల అభిమానధనురాలు నా భార్య గనుక ఆమె జీవిత సంగ్రహాన్ని పఠితుల సమ్ముఖాన వుంచటానికి సాహసిస్తున్నాను. అందునా నా భార్య దివంగతురాలు గనుక సముజ్జ్వల భారత స్వాతంత్రోద్యమ చరిత్రకు ఆమె తన వంతు కృషిని జోడించిన వైనాన్ని గర్వంగానే మీముందు వుంచటానికి వెనుకాడబోవటం లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో రాజధానీ నగరం కాకుండ మరో జంటనగరాలుగా ప్రసిద్ధిచెందిన వరంగల్లు-హనుమకొండలలో హనుమకొండలో 1934లో శ్రీ కానర్ల శంకరయ్య- నరసమ్మ దంపతులకు శ్రీమతి సరోజిని జన్మించింది. ఈ కుంటుంబానికి



## శ్రీ బి.సి.హెచ్. రంగారెడ్డి

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ టి. హయగ్రీవాచారి గారి కుటుంబంతో మొదటి నుంచి యెక్కువ సాన్నిహిత్యం వుండటం సరోజిని జీవితంలో జాతీయ భావాలు కలగటానికి ప్రధాన కారణంగా చెప్పవచ్చు. ఆమె పన్నెండు సంవత్సరాల వయస్సులో గాంధీమహాత్ముణ్ణి దర్శించ గలగటం కూడా సరోజినికి మాతృదేశంపట్ల భక్తిభావం దృఢతరం కావటం మరో ప్రబల కారణం. 1946లో గాంధీమహాత్ముడు దక్షిణ భారత హిందీ ప్రచారసభ స్నాతకోత్సవాలకు మద్రాసువెళ్లి తిరుగు ప్రయాణంలో వరంగల్లులో యేర్పరచిన బహిరంగ సభలో పాల్గొన్నప్పుడు సరోజిని మహాత్ముణ్ణి దర్శించి ఆయన పవిత్రవాణిని వినగలిగి ధన్యురాలైంది.

ఆ తర్వాత భారతదేశ రాజకీయ చరిత్రలో జరిగిన పెనుమార్పులలో భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించటం అత్యంత ప్రధానమైనది. హైదరాబాదు సంస్థానానికి చుట్టూవున్న బ్రిటిషు ఇండియా స్వతంత్రరాజ్యంగా అవతరిస్తే మదమెక్కిన

నిజాం నవాబు తన సంస్థానాన్ని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకొంది. సంస్థానంలో జరిగే విముక్తి పోరాటాలను ఇనుపపాదాల క్రింద నొక్కిపెట్టజూచాడు. సంస్థానంలో రజాకార్లహింసాకాండ పెట్రేగిపోయింది. విముక్తి దళాలు కూడా అంతే తెగింపుతో పోరాటానికి సంసిద్ధమయ్యాయి. వరంగల్లు కోటపై దేశభక్తుడు మొగిలయ్య త్రివర్ణ పతాకాన్ని ఎగురవేస్తూ నిజాం ముష్కర మూకలదాడిలో హతుడయ్యాడు. అంతే పోరాటం తారాస్థాయికి జేరుకుంది. సరిహద్దు ప్రాంత్లాలో పోరాట కేంద్రాలు నెలకొల్ప బడ్డాయి. ఆ విధంగా శ్రీ హయగ్రీవాచారి నాయకత్వాన యేర్పడిన విజయవాడ పోరాట కేంద్రానికి సరోజిని కూడా తన కుటుంబంతో చేరుకుంది. ఆ కేంద్రంలోని పోరాట యోధుల సహాయకార్యక్రమాలలో సరోజిని హయగ్రీవాచారిగారి సోదరి యశోధరతో కలసి చురుకుగా పాల్గొనేది.

సంస్థాన విముక్తి పోరాటం సఫలమైన తర్వాత సరోజిని తిరిగి విద్యావ్యాసంగంలో మునిగిపోయి 1955 నాటికి ఉపాధ్యాయినిగా కూడా స్వతంత్ర భారతంలో వుద్యోగాన్ని సంపాదించుకోగలిగింది.

తెలంగాణా ప్రాంతానికిచెందిన సరోజిని రాయలసీమవాసినైన నేను భార్యాభర్తలు కావటం అడవిలో ఉసిరికాయ - సముద్రంలోని ఉప్పు కలసిన చందమేనని చెప్పుకోవచ్చు. 1967 ఏప్రిల్ 20న మా యిద్దరి వివాహం జరిగింది. కర్నూలు జిల్లాలో నేను యుక్తవయసున్పు వచ్చిన దగ్గరనుంచి రాజకీయకార్యకర్తనే! ఈజిల్లాలోనే రమారమి నావయస్సే కలిగిన శ్రీ వెంపోగారు కూడా రాజకీయకార్యకర్తగా వుండేవారు. నేను కమ్యూనిష్టును. శ్రీ వెంపో సోషలిష్టు. రాయలసీమ క్షామ నివారణ కార్యక్రమాల్లో మేమిద్దరం చురుకుగా పాల్గొనే వాళ్లం. క్షామ నివారణ నిధులకై శ్రీ వెంపో విరచిత "లోకం పోకడ" నాటకాన్ని ప్రథమసాధారణ ఎన్నికలు జరిగిన తర్వాత నంద్యాలలో ప్రదర్శించటం జరిగింది. ఆ పిదప నేను హైదరాబాదు చేరుకొని అనేక ప్రజాహిత కార్యక్రమాలలో ముఖ్యంగా ప్లానింగ్ కమీషన్‌వారి నిషాబంధీ లోక్ కార్యక్షేత్రాలకు అడ్మినిస్ట్రేటర్‌గా పనిచేస్తుండే వాణ్ణి. ఇక యిక్కడ నా ప్రస్తావనను గురించి ఆపి 1994 మార్చి15న సరోజిని హఠాన్మరణానికి నివాళిగా కవి మిత్రుడు శ్రీ వెంపో ఆనాడు వ్రాసిన పద్యావళిలో ఒక పద్యాన్ని ఇక్కడ ఉదహరిస్తూ ముగిస్తున్నాను.

స్వాతంత్ర్య సమరాన సమిధయై తనువొడ్డి
పోరిన వీరుని భార్యగాను
కొడుకు కూతురులను గొప్పగా చదివించి
తనరార జేసిన తల్లిగాను
ఓర్పుతో బడిలోన నేర్పుగా పాఠాల
నలవరచెడి పంతులమ్మగాను
విద్యాధికుండైన వినయసంపన్నుని
అల్లునిగా గొన్న అత్తగాను
చకచకా వచ్చిన పనుల చక్కబరచి
ఎంతకాలమున్న నిచట యింతియెయని
ఎవరి పిలుపునోవిని లేచివెళ్లినట్లు
వెళ్లిపోయె సరోజిని వింతగాను



# శ్రీమతి కె. స్వరాజ్యలక్ష్మి

శ్రీమతి కె. స్వరాజ్యలక్ష్మిగారు కృష్ణాజిల్లా బందరు పట్టణంలో 1923 నవంబర్ 23న సూరపనేని వెంకయ్యచౌదరి -బసవమ్మ దంపతులకు జన్మించారు. ఈమెకు ముగ్గురు అన్నలు. ఐదుగురు అక్కలు. ఇద్దరు చెల్లెండ్రు వున్నారు. ఈమె పదహారేళ్ళ వయస్సులో వుండగానే తండ్రి వెంకయ్య చౌదరిగారు కాలధర్మం చెందారు.

స్వరాజ్యలక్ష్మి అన్నలు ముగ్గురు కూడా స్వాతంత్ర్య సమరయోధులే. అక్కలు కూడా స్వాతంత్ర్య సమరంలో పాల్గొనినవారే. వీరి అక్క జస్టిస్ సీతామహలక్ష్మిగారు కాంపోజిట్ మద్రాస్ రాష్ట్రంలో ప్రధమ తెలుగు మహిళా అడ్వకేట్‌గా బార్‌కౌన్సిల్‌లో నమోదు అయ్యారు. అంతేకాకుండా పట్టభద్రుల నియోజకవర్గంనుండి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యురాలిగా ఎన్నికయ్యారు.

1938లో పొట్టి శ్రీరాములు కొమరకోలు గాంధీ ఆశ్రమం వచ్చినపుడు వారి పెద్దన్నగారి వెంట అక్కడకు వెళ్ళారు. 1940లో కైకలూరు తాలూకా మండవల్లి గ్రామంలో గాంధీసేవా శ్రమమును ఎర్నేని సుబ్రహ్మణ్యంగారి ఆధ్వర్యంలో స్థాపించబడి దానిని ప్రారంభించుటకు ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు, హైస్కూలు స్థాపన ప్రారంభోత్సవం డా॥ భోగరాజు పట్టాభిసీతా రామయ్యగారు చేసినపుడు వారుభయులను శ్రీమతి స్వరాజ్యలక్ష్మి దర్శించి భారతజాతీయోద్య మంపట్ల వారు చేసిన ప్రసంగాలకు ప్రభావితులై కాంగ్రెసు కార్యకర్తగా జాతీయోద్యమ కార్యక్రమాలనుప్రచారం చేశారు.

1940లో జిల్లాబోర్డు ఎన్నికలు జరిగినపుడు బోర్డు సభ్యులుగా మహిళా అభ్యర్థులు గెలుచుటకు కృషిచేశారు. తదుపరి 1942లో క్విట్ ఇండియా ఉద్యమం దేశమంతటా ఉధృతం అయినపుడు శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మి, ఈడ్పుగంటి రత్నమాంబ, వేములపల్లి తులశమ్మ గారలతో పాటు ఆ ఉద్యమంలో పాల్గొని వారెంటు జారీకావడంతో అజ్ఞాతంలోకివెళ్లి బ్రిటిష్ ఇండియాకు వ్యతిరేకంగా ప్రభుత్వానికి నష్టం కలిగించే అనేక విధ్వంసక కార్యక్రమాల్లో పాల్గొన్నారు, ప్రభుత్వానికి నష్టం కలిగించారు. దేశానికి స్వాతంత్ర్యం లభించాక అనేక సాంఘిక సంక్షేమ కార్యక్రమాల్లో పాల్గొనడమే గాకుండా ముఖ్యంగా ప్రకాశంజిల్లాలో మహిళాభ్యుదయ కార్యక్రమాలను సహకార రంగంలో ఎన్నింటినో చేతబట్టి మహిళల అభ్యున్నతికి కృషిచేశారు. భద్రాచలంలోని శ్రీ సీతారామచంద్రస్వామి వారిదేవస్థానం ధర్మకర్తల మండలి సభ్యురాలిగా వీరిని ప్రభుత్వం నామినేట్ చేసింది. ఆ పదవిలో మూడేళ్ళ పాటు వుండి బాధ్యతలను క్రమశిక్షణతో నిర్వహించారు. ●

# శ్రీ టేకూరు సుబ్బారావు

జమ్మలమడుగు తాలూకా సున్నపురాళ్ళ పల్లెలో జననం. తండ్రి కరణం సుబ్బ రాయుడు! వ్యవసాయం; చిన్నవయసు లోనే వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని 13 రోజులు జమ్మలమడుగు జైలులో నిర్బంధింప బడినారు. మైనరుగా వున్నాడన్న కారణంగా వదిలారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా డిఫెన్స్ ఆఫ్ ఇండియా చట్టం ప్రకారం 1సం॥రం కఠినశిక్ష బల్లారి, అల్లీపురం క్యాంపు జైలునందు అనుభవించారు. జమ్మలమడుగు తాలూకా కాంగ్రెస్ కమిటి కార్యదర్శిగా పనిచేశారు. స్వరాజ్యం రాక మునుపు 1945 సంవత్సరంలో జాతీయ కాంగ్రెస్‌కు రాజీనామా చేసి వై. ఈశ్వరరెడ్డి గారితో కలిసి కమ్యూనిస్టు పార్టీలో చేరి ఆ పార్టీ అభివృద్ధికి కృషి చేశారు 1948 మధ్యకాలంలో అరెస్టు కాబడి బళ్లారి. విశాఖపట్నం కడలూరు జైళ్ళలో దాదాపు 3సంవత్సరాలకు పైగా డిటెన్యూగా నిర్బధింపబడినారు. కడలూరు జైలునందు జరిపిన లాఠి చార్జి కాల్పులలో లాఠి దెబ్బలకు గురికావడంతో బాటు ఆనాటి మదరాసు రాష్ట్రంలో ప్రఖ్యాతి చెందిన కమ్యూనిస్టు నాయకులు. ఎ.కె. గోపాలన్ యం.ఆర్.. వెంట్రామన్ కె. యల్. నరసింహం, మొదలగు వారిపై జైలు అధికారులు పోలీసులు పెట్టిన కేసునందు వీరు కూడా ఉన్నారు . మార్కాపురం పోలీసు క్యాంపునకు తీసుకువెళ్ళి చిత్రహింసలకు గురిచేసిన వారిలో వీరు కూడా ఒకరు. రైతు, చేనేత, కార్మిక సంఘాల అభివృద్ధికి ప్రజా ఉద్యమా లకు నాయకత్వం వహించి వాటి అభివృద్ధికి కృషిచేశారు. గండికోట మొదలగు ప్రాజెక్టుల కొరకు జరిపిన ఆందోళనలో పాల్గొన్నారు. స్వతంత్ర పోరాటములో పాల్గొన్నందుకు మదనపల్లె సబ్ కలెక్టరు వారిచే 4 సంవత్స రాల శిక్ష విధించబడి, బళ్ళారి వేలూరు తిరుచునాపల్లి జైలునందు జీవితం గడిపిన (1928 నుండి 1930,1932 నుండి 1934) టేకూరు రామచంద్రరావు 1936 నుండి జమ్మలమడుగు తాలూకా కాంగ్రెస్ కమిటి కార్యదర్శిగా పనిచేసి జమ్మలమడుగు తాలూకాలో కాంగ్రెస్ సంస్థ అభివృద్ధికి కృషి చేసిన టేకూరు కె.వి. సుబ్బారావుగారలు వీరి చిన్నాయనగారే. వీరి కుటుంబ సభ్యులు మహాత్మా గాంధి నాయకత్వాన సాగిన స్వతంత్ర పోరాటంలో 1928 నుండి వరుసగా 1934 వరకు జైలు జీవితం గడిపిన టేకూరు రామచంద్రరావు తరువాత 1936 నుండి 1941 వరకు జమ్మలమడుగు తాలూకా కాంగ్రెస్ కార్యదర్శిగా వ్యక్తిగత సత్యాగ్రహ నిర్వాహకుడుగా నున్న టేకూరు కె.వి. సుబ్బారావుగారు తరువాత వ్యక్తి గత సత్యాగ్రహం కాలంలో సత్యాగ్రహిగా, క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో సంగ్రామ సైనికునిగా ఒకరి తరువాత ఒకరు వరుసగా స్వరాజ్యం వచ్చే వరకు మాతృదేశ సేవలో పాల్గొనడం వీరి కుటుంబము యొక్క ప్రత్యేకత. ●




శ్రీమతి సుశీలాదేవి గారు నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా శర్బనాపురం గ్రామంలో శ్రీ కొమ్మిరెడ్డి రామిరెడ్డి, సుందరమ్మ దంపతులకు జన్మించారు. శర్బనాపురం, తూర్పుగూడెం, మందనపల్లి గ్రామాలు "కొల్లూరు", జాగీరు క్రింద వుండేవి. జాగీరు, కౌలుదారుకు సంబంధించిన భూసమస్యలు, వెట్టి చాకిరి మొదలుగాగల విషయాలపై సుశీలాదేవి గారి తండ్రికి కొల్లూరి జాగీరుదారుకు ఆ రోజుల్లో తగాదాలు నడుస్తుండేవి. అలాంటి ఆ రోజుల్లో భూ సమస్యల పరిష్కారానికి, వెట్టి చాకిరి నిర్మూలనకు వ్యతిరేకంగా ప్రచారము చేసుకుంటూ శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డిగారలు శర్బనాపురం, తూర్పుగూడెం, మందనపల్లి గ్రామాలకు వెళ్లుతుండేవారు. ఈ గ్రామాల్లో ఆ రోజుల్లో ప్రాథమిక పాఠశాలలు కూడా వుండేవి కావు. చదువుకై బాలబాలికలు కొల్లూరు గ్రామానికి వెళ్లుతుండేవారు. సుశీలాదేవిగారు కూడా చదువుకొరకై కొల్లూరు గ్రామం వెళ్లునపుడు పరదా పద్ధతిలో వెళ్లెవారు.

ఒకరోజు శ్రీ కొత్వాల్ వెంకటరామారెడ్డి గారిని హైదరాబాదు నుండి నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా కొలనుపాక గ్రామానికి శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డి గారు తీసుకు వెళ్లారు. అపుడు సుశీలాదేవి తండ్రి సుశీలా దేవి గారిని కూడా తన వెంట తీసుకొని వెళ్లి వెంకట్రామారెడ్డిగారిని కొలనుపాకలో దర్శించుకోవడం జరిగింది.

ఆ తదుపరి కొన్నాళ్లకు శ్రీమతి ఆరుట్ల కమలాదేవిగారు, మల్లు స్వరాజ్యంగారు సుశీలాదేవి గారి గ్రామానికి వెళ్లారు. హైదరాబాదులో శ్రీ వెంకటరామారెడ్డిగారు బాలికల కొరకై హాస్టలును స్థాపించారు. ఆ హాస్టలులో వుండి చదవమని సుశీలాదేవిగారిని ప్రోత్సహించారు. సుశీలాదేవి తనతండ్రి అనుమతితో హైదరాబాదుకు వెళ్లి శ్రీ వెంకట్రామారెడ్డిగారు స్థాపించిన బాలికల హాస్టల్లో వుండి తన చదువును ప్రారంభించింది. అప్పట్లో ఆ హాస్టలుకు వార్డెన్ శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మ గారు. హైదరాబాదు లో శ్రీ వెంకట్రామారెడ్డిగారు స్థాపించిన బాలికల హాస్టలుకు ఎదురుగా ఆంధ్ర మహా సభ

కార్యాలయం కూడా వుండేది. ఆ కార్యాలయానికి సుశీలాదేవి గారు తరుచు వెళ్లుతుండేవారు. అక్కడ ఆమెకు రావి సీతాదేవి, నిమ్మగడ్డ సత్యావతమ్మ గార్లతో పరిచయం ఏర్పడింది. ఆంధ్రమహాసభ కార్యాలయం ద్వారా సుశీలాదేవి గారికి స్టూడెంట్సు యూనియన్లతో కూడా పరిచయాలు ఏర్పడ్డాయి. ఏ ఉద్యమమైనా విజయవంతం కావాలంటే ఆ ఉద్యమానికి విద్యార్థులు, యువతీ, యువకులు వెన్ను పూసలాంటి వారు. అది 1945వ సంవత్సరం అప్పటికి హైదరాబాదు సంస్థాన రాజకీయ పరిస్థితి అస్తవ్యస్తంగా వుండింది. నిజాం నవాబు ఒక్కొక్కరోజు ఒక్కొక్క ప్రకటన చేస్తూ ఒకరితో ఒక విధంగా, మరొకరితో మరో విధంగా మాటలాడుచు కపట నాటకంతో దోబూచులాడు తుండే వాడు. అందువల్ల హైదరాబాదు సంస్థాన మందంతటను కల్లోల పరిస్థితి ఏర్పడింది.

ఒక వైపు బ్రిటిష్ వారితో సంప్రదింపులు జరుపుతూ 'నేను మీకు విధేయుడను' మీ మిత్రుడను అని తెలిపి బ్రిటీష్ పార్లమెంటు సహాయాన్ని పొందడానికి ప్రయత్నిస్తాడు. మరొకవైపు ద్విజాతీ సిద్ధాంత నాయకుడు ముస్లింలీగ్ నేత మహమ్మదాలీ జిన్నాతో మంతనాలు జరుపుతూ సమయమొచ్చిన పుడు హైదరాబాదు సమస్యను కాశ్మీర్‌తో ముడిపెట్టమని ప్రాధేయపడతాడు.

ఇక హైదరాబాదు సంస్థానంలో ఖాసిం రజ్వీ నాయకత్వంలో ఇత్తేహాతుల్ ముస్లిమీన్ సంస్థను వెన్నుతట్టి లేపి దానిని పెంచి పోషిస్తూ ముస్లిం ఆధిక్యత పేరిట సంస్థాన మందం తటను అలజడులు సృష్టించి హిందూ ప్రజలను భయభ్రాంతులను చేయ మని ప్రోత్సహించాడు. ఇంకొక వైపు సంస్థాన విమోచనోద్యమ నాయకులతో సంప్రదిం పులు, అనునాటకంతో విలంబనాన్ని ఆలం బనం చేసుకోసాగాడు నిజాం నవాబు. అట్టి స్థితిలో విద్యార్థి, యువతీ, యువక లోకం జాగృతమైంది. ముఖ్యంగా తెలంగాణ ప్రాంతంలోని విద్యార్థి, యువతీ, యువక లోకం మరింత జాగృతమైంది. విద్యార్థి లోకం అంతా హైదరాబాదు స్వాతంత్ర్య సమరంలో దూకింది. అట్టివారిలో శ్రీమతి సుశీలా దేవి గారు కూడా ఒకరు. ఈ సంఘటనకు ముందే 1941లో నల్లగొండ జిల్లాలోని చిలుకూరులో 8వ ఆంధ్ర మహాసభ జరిగింది. ఆ మహా సభలో పాల్గొడానికి సుశీలాదేవిగారి తండ్రి వెళుతూ తన వెంట కూతురు సుశీలా దేవి గారిని కూడా తీసుకువెళ్లారు. అటు తరువాత 1944లో భువనగిరిలో శ్రీ రావి నారాయణ రెడ్డి గారి అధ్యక్షతన జరిగిన 11వ ఆంధ్ర మహాసభకు సుశీలాదేవి గారు స్వచ్ఛంద సేవకురాలిగా పనిచేశారు. బెంగాల్ కరువు బాధితుల సహాయార్థం విరాళాలు సేకరించి బాధితుల సహాయనిధికి జమకట్టారు.

స్త్రీ విద్యా వ్యాప్తికి కృషి చేస్తూ, వితంతు వివాహాలను ప్రోత్సహించడంతో పాటు బాల్య వివాహాల నిరోధానికి సుశీలాదేవి గారు పనిచేశారు.. ఆ స్థితిలో ప్రజా ఉద్యమాలపై ప్రభుత్వ దమనకాండ ఎక్కువైంది. దానికి తోడు గ్రామగ్రామాన ముస్లిం మతోన్మాదు లైన రజాకార్ల బెడద.

ఇంతలో 1947 ఆగస్టు 15న భారత దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించబడింది. దానికి ముందు నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ హైదరాబాదు స్వతంత్ర రాజ్యంగా వుంటుంది, భారతదేశంలో విలీనం కాబోదు అని ప్రకటించాడు. దానితో ఇక లాభం లేదని అటు కాంగ్రేసు, ఇటు కమ్యూనిస్టు పార్టీలు సాయుధ, సరిహద్దు పోరాటాలే హైదరాబాదు విముక్తికి శరణ్యం అని నిశ్చ యించాయి. ఆ విధంగా నిశ్చయించబడి విజయవాడలో శ్రీ లక్ష్మీనరసింహ్మారెడ్డి గారి నాయకత్వంలో (కమ్యూనిస్టు పార్టీ) ఏర్పాటైన సాయుధపోరాట శిక్షణ కేంద్రంలో శిక్షణ పొంది నిజాంకు వ్యతిరేకంగా సరిహద్దు పోరాట యోధురాలుగా అవిశ్రాంతమైన పోరాటాన్ని సలిపారు శ్రీమతి సుశీలా దేవి గారు. ఆ పోరాటపు రోజుల్లోనే మరొక సాయుధ పోరాట యోధుడైన శ్రీ కట్కూరి రామ చంద్రారెడ్డి శ్రీమతి సుశీలా దేవిగారి వివాహం జరిగింది. అంటే హైదరాబాదు సంస్థానం నిజాం బానిసత్వం నుండి విముక్తి పొంద డానికి ఒక రోజు ముందు (సెప్టెంబరు 16, 1948) శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డి, ఆరుట్ల కమలాదేవి, శ్రీ యం.వి.ఆర్. ప్రసాద్ గార్ల సమక్షంలో సుశీలాదేవి గారు శ్రీ రామ చంద్రారెడ్డి గారు పూలదండలు మార్చు కున్నారు. 1948 సెప్టెంబరు 17 భారత సైన్యాలు హైదరాబాద్ సంస్థానాన్ని స్వాధీనం చేసుకొని దానిని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేశాయి. సంస్థాన ప్రజలు స్వేచ్ఛా వాయువులను పీల్చుకోసాగారు. ఆ తరు వాత కూడా కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో నడిచిన సాయుధ పోరాటం భూ సమస్యల పరిష్కారానికై రైతాంగ సాయుధ పోరాటంగా రూపుదిద్దుకుంది.

ఆ పోరాటంలో పెళ్లయిన రెండు మాసాలకే సుశీలాదేవి గారు అరెస్టు చేయబడి హైదరాబాదు జైలులో వుంచ బడ్డారు. అప్పటికి ఆమె చూలాలు (గర్భిణీ స్త్రీ) గా వున్నారు, నిండు నెలలు అంటే ప్రసవించే రోజులు వచ్చేంత వరకు జైలులోనే వున్నారు. ప్రసవించే రోజులొచ్చాయని సుశీలాదేవి గారిని పోలీసులు వారి గ్రామంలో వదిలి పెట్టారు కొన్ని ఆంక్షలతో. పైగా కమ్యూనిస్టులను కాల్చిచంపుతున్న రోజులవి. అందువలన సుశీలాదేవి గారి ప్రసవ సమయంలో ఎవరూ ఆదుకోలేదు. తండ్రి, భర్త ఇద్దరు జైలులోనే వున్నారు. ఏదోవిధంగా అతికష్టంపై సుశీలాదేవి ప్రసవం జరిగిపోయింది.

ఆ తదుపరి కొంతకాలానికి మద్రాసు లో జరిగిన శాంతి మహాసభలకు ప్రతినిధి గా హాజరయ్యారు సుశీలాదేవి గారు.

పంచాయితీరాజ్ వ్యవస్థలో పంచా యతీ సమితి సభ్యురాలిగా ఎన్నికయ్యారు. నల్లగొండ జిల్లా పరిషత్తుకు కో-ఆప్టెడు సభ్యురాలిగా నియుక్తి చేయబడ్డారు. కొల్లూరు గ్రామ పంచాయితీ అధ్యక్షులుగా 11 ఏళ్ల పదవీ బాధ్యతలు నిర్వహించి గ్రామాభ్యుదయానికి ఎంతో కృషిచేశారు. 1982లో శాసనసభకు రామన్నపేట నియోజకవర్గం నుండి పోటీచేసి 500 ఓట్ల తేడాతో ఓడి పోయారు. ●





## శ్రీ చిప్పాడ సూర్యనారాయణమూర్తి

## శ్రీమతి సూర్యనారాయణమూర్తి

శ్రీ చిప్పాడ సూర్యనారాయణమూర్తి విశాఖజిల్లా భీమునిపట్నంలో అతి నిరుపేద కుటుంబంలో జన్మించారు. చిన్నప్పుడే తల్లిదండ్రులను కోల్పోయిన శ్రీ సూర్య నారాయణ మూర్తిగారు సంఘ సంస్కరణాభి లాషులైన శ్రీ కోరాడ లక్ష్మీనారాయణ-మహాలక్ష్మమ్మ దంపతుల బడిలో చేరి వారిచే పెంచి పెద్ద చేయబడడం వలన సహజంగా శ్రీ సూర్యనారాయణ మూర్తిగారిలో నిస్వార్థ సేవ జేయడం, త్యాగమయ బుద్ధితో మెలగడం, నిరుపేదల పట్ల ప్రేమ, కారుణ్యం వాత్సల్యము కలగడానికి కారణ మయ్యాయి. సాంఘిక సమానత్వం కోసం కృషిచేసే కార్యక్రమంలో భాగంగా ఆయన 1940లో కమ్యూనిష్టు పార్టీలో చేరి ఆనాటి కమ్యూనిష్టు అగ్రనేతలైన కీర్తిశేషులు శ్రీ యం.వి. భద్రం, శ్రీ జొన్నలగడ్డ రామ లింగయ్యగారి నేతృత్వంలో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని అజ్ఞాత యోధునిగా సామ్రాజ్యవాద బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేసి ఎన్నో కష్టాలకు గురయిన స్వాతంత్ర్య సమర యోధుడు శ్రీ సూర్యనారాయణ మూర్తిగారు. అటుపిమ్మట గాంధీజీ అనుయాయులైన శ్రీ రెడ్డిపల్లి సత్యనారాయణగారి (దేవుడు బాబు) ప్రోత్సాహంతో 1942లో విశాఖపట్టణము నందలి ప్రేమసమాజం సభ్యత్వాన్ని స్వీకరించి ఆ సమాజం ద్వారా రెండో ప్రపంచయుద్ధంలో బర్మాలో జరిగిన బాంబుల దాడుల నుండి ప్రాణరక్షణార్థం ఇండియాకు తరలివచ్చిన లక్షలాది కాందిశీకుల సేవలో నిమగ్నమై అహోరాత్రులు వారి సేవ చేయడంతోపాటు అదే సమయంలో 1942-45 సంవత్సరాల మధ్యకాలంలో ఉత్తరాంధ్రలో సంభవించిన భయంకర కరువుకు గురైన బాధితుల ఆకలి దప్పులు తీర్చుటకై అహర్నిశలు కృషి చేశారు. శ్రీ సూర్యనారాయణమూర్తిగారు. దాని ఫలితంగా 22 సంవత్సరాల వయస్సులో సమాజం మహోన్నత గౌరవ కార్యదర్శి పదవికి ఎన్నుకోబడ్డారు. హరిజనుల దేవాలయ ప్రవేశానికై సింహాచలంలో ఆందోళన జరిపి ఆ పుణ్యక్షేత్రంలో హరిజనులకు దేవాలయ ప్రవేశం కల్పించి అమరజ్యోతి పొట్టిశ్రీరాములు వంటి ప్రముఖుల ప్రశంసలనందుకున్నారు శ్రీ

సూర్యనారాయణమూర్తిగారు. అంతేగాకుండా ప్రేమసమాజం భవన సముదాయానికి స్థలసేకరణ చేసి కాంగ్రేసు అగ్రనేతలు డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య శ్రీ యన్. వి. గాడ్గిల్ గార్లతో శంఖుస్థాపన చేయించారు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాక ఇండియాకు ప్రప్రధమ గవర్నర్ జనరల్‌గా వ్యవహరించిన కాంగ్రేసు అగ్రనేత శ్రీ చక్రవర్తుల రాజా గోపాలాచార్యుల వారిని భవనసముదాయానికి సేకరించిన స్థలాన్ని దర్శింపజేశారు. విశాఖపట్టణంలో "నాటక కళామండలి"ని స్థాపించి అందులో స్త్రీ పాత్రలను కుటుంబ స్త్రీలతోనే ప్రదర్శింపజేస్తూ జీవకారుణ్య, మద్యపాన నిషేధ, అస్పృశ్యతా, ప్రకృతి చికిత్సా ప్రచారములను నిర్వహించి అనాధ ప్రేతములకు అంత్యక్రియలు చేసే కార్యక్రమాలను నిర్వహించడంతోపాటు కలరా, మశూచి, కుష్టు మొదలగు భయంకరమైన అంటువ్యాధి రోగగ్రస్థులకు తమ సేవలనందించిన సాంఘిక సేవామూర్తి శ్రీ సూర్యనారాయణ మూర్తి గారు. దీర్ఘకాలవు గుండె జబ్బుకు లోనై మృత్యుముఖాన వున్న నిరుపేద బాలవితంతువు సుమంగళిగా మరణించాలన్న తుదికోర్కె మేరకు అమరజ్యోతి పొట్టి శ్రీరాములుగారి ఆదేశాన్ననుసరించి శ్రీ సూర్యనారాయణ మూర్తిగారు బ్రహ్మచర్య వ్రతాన్ని వీడి ఆమెకు మాంగళ్యాన్ని ప్రసాదించదలచి ముందుగా ఆమెను ప్రకృతి చికిత్సాలయంలో చికిత్స చేయించి జబ్బును నయం చేయించి ఆమెను వివాహమాడి "బలిపీఠం" నవల కథావస్తువునకు. అనంతరం అది చలనచిత్రంగా ప్రభవించుటకు కారకులైన కారుణ్యమూర్తి శ్రీ నారాయణగారు. ఆ తదుపరి వెనుకటి హైదరాబాదు రాష్ట్రంలో ప్రవేశించి హైదరాబాదు చేనేత సహకార సంఘంలో ఉన్నతోద్యోగిగా ప్రవేశించి చేనేత రంగంలో చేనేత పారిశ్రామికులకు ఎంతో సహాయపడిన ధన్యజీవి శ్రీ సూర్యనారాయణ మూర్తిగారు. బరంపురం, పర్లాకిమిడి పట్టణాలలోవిద్యాసంస్థలను స్థాపించడంతో పాటు ప్రముఖ గాంధేయ వాదులైన అమరజ్యోతి పొట్టి శ్రీరాములు, రెడ్డిపల్లి సూర్యనారాయణ గార్ల జీవిత చరిత్రలను వ్రాసి ప్రచురించి వారి మహోన్నత త్యాగాలను గూర్చి ఈనాటి యువతరానికి అందించారు.

నాలుగు పర్యాయాలు గుండెపోటు వచ్చినా చెక్కుచెదరని ధైర్యంతో ఈనాటికి భుజాన వేసుకున్న కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోవడంలో శ్రీ సూర్యనారాయణ మూర్తిగారు ఆయనకు ఆయనే సాటి.

కనుకనే 16-4-1994న హైదరాబాదు చిక్కడపల్లిలోని త్యాగరాయగాన సభలో చైతన్యమండలి వారు నవయుగవైతాళికుడు శ్రీకందుకూరి వీరేశలింగం 147వ జన్మదినోత్సవ సందర్భంగా త్యాగరత్న బిరుదుతో శ్రీ సూర్యనారాయణమూర్తిగారికి అవార్డును అందజేశారు. ఇపుడు వారి వయస్సు 77 సంవత్సరాలు. ప్రస్థుతం విశాఖపట్నంలోని నౌరోజీ రోడ్‌లో గల 14-1-4 నంబరు గల ఇంటిలో సతీమణితో ప్రశాంత జీవనం గడుపుతున్నారు.




శ్రీ అన్నం సోమేశ్వర రావుగారు ప్రకాశం జిల్లా చీరాల తాలూకా ఈపూరు గ్రామ వాస్తవ్యులు. (ఈ గ్రామం పూర్వం గుంటూరు జిల్లాలో వుండేది) వీరి తండ్రి శ్రీ ఓబుల స్వామిగారు. నిరుపేద కుటుంబం. వీరి వృత్తి దర్జీవృత్తి. భారత జాతీయోద్యమంలో ప్రముఖ పాత్రను నిర్వహించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా మొదట్లో 500 మంది విద్యార్థులు మేజిస్ట్రేట్ కోర్టు వద్దకు ఊరేగింపుగా వెళ్ళి మేజిస్ట్రేట్ కోర్టును మూసివేయించారు. ఆ తదుపరి సబ్ రిజిస్ట్రార్ ఆఫీసును, సేల్సుట్యాక్సు ఆఫీసును కూడా మూసివేయించారు. ఆ సంఖ్య సామాన్య ప్రజలతో 1500 వరకు పెరిగింది. వారంతా కలిసి సైనిక రిక్రూట్‌మెంట్ ఆఫీసరుతోను, మరొక రైల్వే అధికారితోను మహాత్మాగాంధీకి జై అనిపించి విడిచిపెట్టారు. రిజర్వు పోలీసులు వచ్చేలోగా ఎవరి దారిన వారు వెళ్ళి పోయారు. అట్టి వారిలో శ్రీ సోమేశ్వర రావుగారు కూడా ఒకరు. శ్రీ సోమేశ్వర రావు గారిపై 140/42 నంబరు క్రింద క్రిమినల్ కేసు మోపబడింది. ఫలితంగా 3-4-1943 నుండి 10-3-1945 వరకు శ్రీ సోమేశ్వర రావుగారికి రెండు సంవత్సరాల జైలు శిక్ష విధించబడింది. బళ్లారిలోని అల్లీపురం మరియు, వెల్లస్లీ శానిటోరియం జైళ్లలో శిక్షను అనుభవించారు.

శిక్ష విధించిన తేదీ - 3-4-1943

బెయిలుపై విడుదల- 28-4-1943

తిరిగి అరెస్టు చేసిన తేది - 14-7-1943

జైలు నుండి విడుదల అయిన తేది - 10-3-1945

రెమిషన్ - 93 రోజులు



# శ్రీ అన్నం సోమేశ్వర రావు

శ్రీ అన్నం సోమేశ్వర రావుగారు ప్రకాశం జిల్లా చీరాల తాలూకా ఈపూరు గ్రామ వాస్తవ్యులు. (ఈ గ్రామం పూర్వం గుంటూరు జిల్లాలో వుండేది) వీరి తండ్రి శ్రీ ఓబుల స్వామిగారు. నిరుపేద కుటుంబం. వీరి వృత్తి దర్జీవృత్తి. భారత జాతీయోద్యమంలో ప్రముఖ పాత్రను నిర్వహించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా మొదట్లో 500 మంది విద్యార్థులు మేజిస్ట్రేట్ కోర్టు వద్దకు ఊరేగింపుగా వెళ్లి మేజిస్ట్రేట్ కోర్టును మూసివేయించారు. ఆ తదుపరి సబ్ రిజిస్ట్రార్ ఆఫీసును, సేల్సుట్యాక్సు ఆఫీసును కూడా మూసివేయించారు. ఆ సంఖ్య సామాన్య ప్రజలతో 1500 వరకు పెరిగింది. వారంతా కలిసి సైనిక రిక్రూట్‌మెంట్ ఆఫీసరుతోను, మరొక రైల్వే అధికారితోను మహాత్మాగాంధీకి జై అనిపించి విడిచిపెట్టారు. రిజర్వు పోలీసులు వచ్చేలోగా ఎవరి దారిన వారు వెళ్లి పోయారు. అట్టి వారిలో శ్రీ సోమేశ్వర రావుగారు కూడా ఒకరు. శ్రీ సోమేశ్వర రావు గారిపై 140/42 నంబరు క్రింద క్రిమినల్ కేసు మోపబడింది. ఫలితంగా 3-4-1943 నుండి 10-3-1945 వరకు శ్రీ సోమేశ్వర రావుగారికి రెండు సంవత్సరాల జైలు శిక్ష విధించబడింది. బళ్లారిలోని అల్లీపురం మరియు, వెల్లస్లీ శానిటోరియం జైళ్లలో శిక్షను అనుభవించారు.

శిక్ష విధించిన తేదీ - 3-4-1943

బెయిలుపై విడుదల- 28-4-1943

తిరిగి అరెస్టు చేసిన తేది - 14-7-1943

జైలు నుండి విడుదల అయిన తేది - 10-3-1945

రెమిషన్ - 93 రోజులు